# రెండవ పంచవర్ష ప్రణాళిక:

# పరిశీలన

రచన:

**మోటూరు హనుమంతరావు**

ప్రచురణ:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

1

# ముందు మాట

ఆరువందల పేజీల గ్రంథములో పొందుపరచబడిన రెండవ ప్రణాళికను చిన్న కరపత్రంలో క్లుప్తీకరించి చెప్పడం గాని, వి రంగా పరిశీలించడంగాని అంత తేలికైన పనిగాదు. అయినా నాక చేతనైన పరిమితిలో అందుకు ప్రయత్నించాను. ఈ కరపత్ర రెండుభాగాలుగా వున్నది. మొదటిభాగంలో రెండవ పంచవర్ష ప్రణాళిక రూపమెలా వుంటుందో చదువరుల ముందుంచేందుక ప్రయత్నించాను. అందులో యిచ్చిన లెక్కలూ, విషయమూ అంతా ముసాయిదా ప్రణాళిక నుండి తీసుకున్నవే. అందులో నా వ్యాఖ్యానం ఏమీ లేదు.

క్లుప్తీకరణలో ఏదైనా ఒక ముఖ్యవిషయం పొరపాటున జారిపోయివుండినా వుండవచ్చు. కాని కొన్ని అంశాలలో ఉద్దేశ్య పూర్వకంగానే కొంత సమాచారాన్ని, వివరమైన విమర్శనూగూడా దాటవేశాను. అందుకు కారణం ఆ అంశాలపై యిదే సంద ర్భంలో వేరువేరుగా కరపత్రాలు అచ్చవుతూండటమే. పరిశ్రమల పైన, వ్యవసాయ సంస్కరణలపైన, వ్యవసాయ కూలీలనుగురించీ కార్మికులను గురించీ, సాంఘిక సంక్షేమకార్యకలాపాల్ని గురించీ యీ కరపత్రాలు వెలువడుతున్నాయి. వీటి సందర్భాల్లో మొత్తం దృష్టికి అవసరమైనంతవరకే వ్యాఖ్యానించాను.

పోగా రెండవ భాగాన్ని పూర్తిగా వ్యాఖ్యానానికి విని యోగించాను. ఈ భాగంలో యిచ్చిన లెక్కలుగూడా – ఏ రెండు మూడు సందర్భాల్లోనో మినహాయిస్తే – ముసాయిదా ప్రణాళికలో నున్నవే. చదువరులు పై విషయాల్ని దృష్టిలోపెట్టుకుంటారని ఆశిస్తాను.

—రచయిత.

# ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికల్లో ఒక్కొక్క ప్రధానశాఖక్రింద ఖర్చు

| శాఖ | మొదటి పంచవర్ష ప్రణాళిక | | రెండవ పంచవర్ష ప్రణాళిక | |
|---|---|---|---|---|
| | ఖర్చయిన మొత్తం (కోట్ల రూపాయల్లో) | శాతం | ఖర్చయిన మొత్తం (కోట్ల రూపాయల్లో) | శాతం |
| వ్యవసాయం, కమ్యూనిటీ డెవలప్ మెంటు | 357 | 15.1 | 568 | 11.8 |
| (అ) వ్యవసాయం | 241 | 10.2 | 341 | 7.1 |
| (ఆ) జాతీయవిస్తరణ, కమ్యూనిటీ ప్రాజెక్టుస్కీములు | 90 | 3.8 | 200 | 4.1 |
| (ఇ) ఇతర కార్యక్రమాలు | 26 | 1.1 | 27 | 0.6 |
| 2. ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి | 661 | 28.1 | 913 | 19.0 |
| ఇరిగేషన్ | 384 | 16.3 | 381 | 7.9 |
| విద్యుచ్ఛక్తి | 260 | 11.1 | 427 | 8.9 |
| వరద నిరోధకప్రాజెక్టులు వగైరా | 17 | 0.7 | 105 | 2.2 |
| 3. పరిశ్రమలు, ఖనిజాలు | 179 | 7.6 | 890 | 18.5 |
| పెద్ద, మధ్యతరగతి పరిశ్రమలు | 148 | 6.3 | 617 | 12.9 |
| ఖనిజ పరిశ్రమలు | 1 | — | 73 | 1.5 |
| గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలు | 30 | 1.3 | 200 | 4.1 |
| 4. రవాణా, కమ్యూనికేషన్లు | 557 | 23.6 | 1385 | 28.9 |
| రైల్వేలు | 268 | 11.4 | 900 | 18.8 |
| రోడ్లు | 130 | 5.5 | 246 | 5.1 |
| రోడ్డురవాణా | 12 | 0.5 | 17 | 0.4 |
| రేవులు, హార్బర్లు | 34 | 1.4 | 45 | 0.9 |

| శాఖ | మొదటి పంచవర్ష ప్రణాళిక కేటాయించిన మొత్తం (కోట్ల రూపాయలు) | శాతం | రెండవ పంచవర్ష ప్రణాళిక కేటాయించిన మొత్తం (కోట్ల రూపాయలు) | శాతం |
|---|---|---|---|---|
| నౌకానిర్మాణం | 26 | 1.1 | 48 | 1.0 |
| దేశంలోపల నీటిరవాణా | — | — | 3 | 0.1 |
| సివిల్ వైమానికరవాణా | 24 | 1.0 | 43 | 0.9 |
| ఇతర రవాణాలు | 3 | 0.1 | 7 | 0.1 |
| పోస్టు, టెలిగ్రాఫ్ | 50 | 2.2 | 63 | 1.3 |
| ఇతర కమ్యూనికేషన్లు | 5 | 0.2 | 4 | 0.1 |
| బ్రాడ్‌కాస్టింగ్ | 5 | 0.2 | 9 | 0.2 |
| 5. సాంఘికాభివృద్ధిస్కీములు | 533 | 22.6 | 945 | 19.7 |
| విద్య | 164 | 7.0 | 307 | 6.4 |
| ఆరోగ్యం | 140 | 5.9 | 274 | 5.7 |
| గృహవసతి | 49 | 2.1 | 120 | 2.5 |
| వెనుకబడిన తరగతుల సంక్షేమం | 32 | 1.3 | 91 | 1.9 |
| సాంఘిక సంక్షేమం | 5 | 0.2 | 29 | 0.6 |
| కార్మిక సంక్షేమం | 7 | 0.3 | 29 | 0.6 |
| పునరావాసం | 136 | 5.8 | 90 | 1.9 |
| చదువుకున్న వారి నిరుద్యోగ నివారణకు స్కీములు | — | — | 5 | 0.1 |
| 6. ఇతర శాఖలు | 69 | 3.0 | 99 | 2.1 |
| మొత్తం | 2356 | 100.0 | 4800 | 100.0 |

1

# ప్రణాళికలు : ఫలితాల అంచనాలు

పంచవర్ష ప్రణాళికల ద్వారా జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగిస్తానని ప్రభుత్వం ప్రకటిస్తోంది. నిరుటితో మొదటి ప్రణాళిక కాలం 5 సంవత్సరాలు పూర్తయింది. రెండవ ప్రణాళిక కాలం ఈ యేడు ప్రారంభమైంది.

## మొదటి ప్రణాళిక : ప్రభుత్వ అంచనా

మొదటి ప్రణాళిక కాలంలో కేంద్ర ప్రభుత్వంకాని, రాష్ట్ర ప్రభుత్వాలుగాని ఖర్చు పెట్టదలచింది రు. 2350 కోట్లు. ఖర్చు పెట్టింది 2 వేల కోట్ల రూపాయలు మాత్రం వుంటుంది. ఆహార పదార్థాలు 20 శాతం, ప్రత్తి 45 శాతం, ప్రధానమైన నూనెగింజలు 8 శాతం 1951 నాటితో పోల్చితే 1956 నాటికి ఎక్కువ పండినట్లు ప్రభుత్వ లెక్కలు తెలుపుతున్నాయి. పెద్ద ప్రాజెక్టుల క్రింద 60 లక్షల యకరాలు, మైనరు ప్రాజెక్టులక్రింద ఒక కోటి ఎకరాలు అదనంగా సాగులోకి వచ్చాయి. 657 కోట్ల 50 లక్షల కిలోవాట్ గంటల నుండి 1100 కోట్ల కిలోవాట్ గంటలవరకు విద్యుచ్ఛక్తి పెరిగింది. పారిశ్రామికోత్పత్తి 22 శాతం అధికమైంది. బట్టలు, నూనె, పంచదార, సిమెంటు, పేపరు, సోడా, సైకిళ్లు, కుట్టు మిషన్లు, నూనె శుద్ధి కర్మాగారం మొదలైనవాటిలో వేసుకున్న అంచనాలకు సమంగాగాని, అంతకు మించిగాని ఉత్పత్తి జరిగింది. ఇనుము, ఉక్కు, అల్యూమినియమ్, యంత్ర పరికరాలు, ఎరువులు

కూడా అనుకున్న మేరకు ఉత్పత్తిని అందుకున్నాయి. డీసెల్ ఇంజన్లు, పంపులు, కార్లు, రేడియోలు, బ్యాటరీలు, ఎలక్ట్రిక్ మోటార్లు, ఎలక్ట్రిక్ లాంపులు, ఎలక్ట్రిక్ పంకాలు, జనపనార సంచులు, గ్లాస్ వార్నిష్‌లు వగైరా అనుకున్నంత ఉత్పత్తి జరుగలేదు. కొన్ని రసాయనిక పదార్థాలు, పెన్సిలిన్, డి. డి. టి. మొట్టమొదటగా మన దేశంలో వుత్పత్తి అవుతున్నాయి. సింధ్రీ ఎరువుల ఫ్యాక్టరీ, చిత్తరంజన్ రైలుఇంజన్ల ఫ్యాక్టరీ, తాతాలోకొమోటివ్ ఇంజనీరింగువర్క్సు, నూనెశుద్ధి కర్మాగారాలు మొదలైనవి తయారవడంవలన భారీపరిశ్రమల్లో సహితం కొద్దిగా అభివృద్ధి జరిగింది. ఈ ఉత్పత్తి ఫలితంగా జాతీయాదాయం 9110 కోట్లరూపాయలనుండి రు. 10800 కోట్లవరకూ అంటే 18 శాతం ఎక్కువైంది. తల ఒక్కటికి సగటు ఆదాయం 11 శాతం పెరిగింది.

వ్యవసాయసంస్కరణలను అమలుజరపాలని మొదటి ప్రణాళిక తలపెట్టింది. జమీందారీ, యీనాందారీ మొదలైన విధానాలు దేశం మొత్తంమీద చాలవరకు రద్దయినట్లు ప్రభుత్వం ప్రకటిస్తోంది. కౌలుదార్లరక్షణచట్టాలుకూడా విభిన్న విధాలుగా వివిధ రాష్ట్రాలలో ప్రవేశపెట్టబడ్డాయి. అయితే కొన్ని రాష్ట్రాలలో "ఇచ్ఛికంగా వదలుకునే" పేరిట పెద్దపెట్టున కౌలుదార్లు భూముల నుండి తొలగించబడ్డారని ప్రణాళికముసాయిదా ప్రకటిస్తోంది. స్వంత కమతాలకు గరిష్ట పరిమితి వుండాలని 7 రాష్ట్రాల ప్రభుత్వాలు మాత్రం శాసించాయిగాని, ఎక్కడా అమలులోకిరాలేదు.

గత అయిదేండ్లలో జరిగిన ఎగుమతుల్లో బాగా ఎగుమతి జరిగిన సంవత్సరాన్ని లెక్కలోకి తీసుకున్నా, అంచనాకంటె 13 శాతంవరకూ తగ్గాయి. పరిశ్రమలకని ప్రభుత్వం ఖర్చుపెట్ట దలచిన 101 కోటి రూపాయల మొత్తంలో 57 కోట్లవరకూ మాత్రమే ఖర్చుచేయబడ్డాయి.

మొదటి పంచవర్ష ప్రణాళిక ఫలితాలను దిగువ విధంగా ప్రభుత్వమూ, ప్రణాళికా సంఘమూ అంచనా కడుతున్నాయి :

ఆహారధాన్యాల దిగుమతి భారాన్ని తగ్గించే విధంగా అధికోత్పత్తి ఆ రంగంలో జరిగింది. కేవలం పారిశ్రామికోత్పత్తిని బట్టి చూస్తే పారిశ్రామికాభివృద్ధి జరిగినట్లు సంతృప్తి కలుగుతుంది. కాని లక్ష్యాలనూ, వివిధ పరిశ్రమలకు నిర్ణయించిన కోటాలనూ దృష్టిలో పెట్టుకుంటే, ఆ విధమైన సంతృప్తి కలగదు. వ్యవసాయరంగంలో ఫలితం బాగా కలగటానికి కొంతవరకు అనుకూలమైన ఋతు పవనాలు కారణం. పరిశ్రమల్లో యిదివరకు ఉపయోగించకుండా వున్న ఉత్పత్తిసామర్థ్యాన్ని ఉపయోగించి ఎక్కువ పనిచేయించడం వలన పారిశ్రామికోత్పత్తిలో గణనీయమైన అభివృద్ధి సాధ్యమైంది. మొత్తంగా చూస్తే, మొదటి ప్రణాళిక ఫలితాలు సంతృప్తికరంగానే వున్నాయి. సోషలిస్టు తరహా సమాజాన్ని సాధించేందుకు అది పునాది వేసింది.

## రెండవ ప్రణాళిక ఆశయాలు

రెండవ ప్రణాళికకు ప్రయత్నం 1954 లో ప్రారంభమైంది. 1955 మార్చిలో "ప్రణాళికా చట్రం" అంటూ ఒకటి తయారై, దానిపై చర్చలు కొనసాగాయి. 1956 ఫిబ్రవరినాటికి ఒక "ముసాయిదారూపం" ప్రకటితమైంది. ప్రభుత్వం, ప్రణాళికా సంఘం దానికి తుదిరూపం యిచ్చి "ప్రణాళిక ముసాయిదా"ను మే నెలలో తయారుచేశారు. ఇప్పుడది పార్లమెంటు ముందున్నది.

భారత ప్రభుత్వం సోషలిస్టు తరహా సమాజ నిర్మాణాన్ని తన ధ్యేయంగా పెట్టుకున్నట్లు ప్రకటించింది. రాజ్యాంగచట్టంలో యీ విధానానికి అనుగుణ్యంగా స్థూలమైన సూత్రాలు యిదివరకే పొందుపరచబడివున్నాయి. ఆ సూత్రాలకు యింకా నిర్దుష్టమైన రూపమే సోషలిస్టు తరహా సమాజం. సమతాదృష్టితో ప్రజాస్వామికపద్ధతిని, ప్లానుప్రకారం ఆర్థిక పురోగమనాన్ని సాధించడం సోషలిస్టు తరహా సమాజంయొక్క లక్షణం అని ప్రణాళిక ముసాయిదా చెబుతోంది. నేటి ఆర్థిక, సాంఘిక చట్రంలో కొన్ని

మంచి ఫలితాలను పొందడమేగాక ఆ చట్రంలోనే మార్పులు తెచ్చి లోతైన సాంఘిక విలువలను సాధించడం కూడా వెనుక బడిన దేశంయొక్క కర్తవ్యంగా వున్నదని ప్రణాళిక ముసాయిదా సూచిస్తూ, దిగువ ఆశయాలను ప్రకటించింది:

1. దేశసంపదను 1960-61 నాటికి నూరింట 25 వంతులు పెంచడం.

2. ప్రాథమిక పరిశ్రమలమీదా, భారీ పరిశ్రమలమీదా ప్రత్యేకశ్రద్ధ చూపుతూ త్వరితంగా పరిశ్రమలను అభివృద్ధిచేయడం. ఇవి ఎక్కువగా ప్రభుత్వరంగంలో జరిగేట్లు చూడడం.

3. 80 లక్షల మందికి కొత్తగా పనులు కల్పించి, ఉద్యోగావకాశాలను ఎక్కువచేయడం.

4. ఆదాయాల్లోనూ, ఆస్తుల్లోనూ గల అసమానత్వాన్ని తగ్గించి, యింకా న్యాయమైన విధంగా ఆర్థికపంపకం జరిగేలా చూడటం.

భారతదేశంలో యిప్పటికే అభివృద్ధి జరిగిన, జరుగుతూన్న వివిధ ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని వెనుకబడియున్న ప్రాంతాలను అభివృద్ధి చేసేందుకు ప్రత్యేక శ్రద్ధ చూపడంకూడా లక్ష్యంగా వున్నట్లు ముసాయిదా ప్రణాళిక స్పష్టపరిచింది. ప్రభుత్వం అనుసరించే విధానాలు పై లక్ష్యాలకు అనుగుణ్యమైనవిగానే వుంటాయని కూడా ముసాయిదా పేర్కొన్నది.

ప్రణాళికకాలం అయిదు సంవత్సరాల్లో ప్రభుత్వరంగంలో 4800 కోట్ల రూపాయలు, ప్రయివేట్‌రంగంలో 2400 కోట్ల రూపాయలు ఖర్చుచేయాలి. ప్రభుత్వ ఖర్చు రు. 4800 కోట్లలో రు. 1000 కోట్లు ప్రణాళిక వేసుకోనకపోయినా మామూలుగా అభివృద్ధి కార్యక్రమాలకోసం సాలుసరి ఆదాయంనుంచి ఖర్చు పెట్టేదే. పోగా రు. 3800 కోట్లు ప్రభుత్వపరంగానూ, రు. 2400 కోట్లు ప్రయివేట్‌గానూ మొత్తం రు. 6200 కోట్లు అదనంగా పెట్టుబడి పెట్టవలసి వస్తుంది. మొదటి ప్రణాళికకు ప్రభుత్వ,

ప్రయివేట్‌రంగాలమధ్య దామాషా మొదటి ప్రణాళికలో 50 : 50 కాగా, యీ ప్రణాళికలో 61 : 39 వుంటుంది. ఈ విధంగా పెట్టిన అదనపు పెట్టుబడిఖర్చు రు. 3100 కోట్లు కాగా, రెండవ ప్రణాళిక పెట్టుబడి దానికి సరిగా రెట్టింపు వుంటుంది. ప్రభుత్వపరంగా ఖర్చవ్వే రు. 4800 కోట్లలో కేంద్రప్రభుత్వంద్వారా రు. 2559 కోట్లు ఖర్చుకాగా, రాష్ట్ర ప్రభుత్వాలద్వారా రు. 2241 కోట్లు ఖర్చవుతుంది.

## ప్రైవేట్ రంగంలో వివిధ శాఖలక్రింద పెట్టుబడి (కోట్ల రూపాయలలో)

| | | |
|---|---|---|
| 1. | సంఘటితరూపంలో ఉన్న పరిశ్రమలు, ఖనిజాలక్రింద | 575 |
| 2. | తేయాకు వగైరా తోటలు, విద్యుచ్ఛక్తి నిర్మాణాలు, రైల్వేలుగాక ఇతర రవాణా | 125 |
| 3. | నిర్మాణాలు | 1000 |
| 4. | వ్యవసాయం, గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు | 300 |
| 5. | స్టాక్‌లు | 400 |
| | మొత్తం : | 2400 |

వివిధ రంగాలలో ఖర్చుపెట్టే మొత్తాలు, సాధించే లక్ష్యాలు సంగ్రహంగా దిగువవిధంగా వుంటాయి :

### పరిశ్రమలు - గనులు

ఈ రంగంలో ప్రభుత్వం రు. 890 కోట్లుఖర్చుపెట్టగా, ప్రయివేట్ పారిశ్రామికవేత్తలు రు. 575 కోట్లు ఖర్చు పెడతారు. గత ప్రణాళికలో 8 శాతం మాత్రం యీ రంగంలో ఖర్చుపెట్టిన ప్రభుత్వం మొత్తం ఖర్చులో యిప్పుడు 19 శాతం ఖర్చుపెట్ట దలచింది. ప్రభుత్వపరంగా ఖర్చయ్యే రు. 890 కోట్లలో చేతివృత్తుల వారికి పనులు చూపించే దృష్టితోనూ, గ్రామీణప్రాంతాలలో

ఎక్కువమందికి అదనపుపని వసతి కల్పించే దృష్ట్యానూ 200 కోట్ల రూపాయలు చిన్న తరహా గ్రామీణ పరిశ్రమలకు ఖర్చుచేస్తారు. మిగతా రు. 690 కోట్లలో ఎక్కువభాగం ప్రాథమిక పరిశ్రమలైన ఇనుము, ఉక్కు, బొగ్గు పరిశ్రమలకూ, భారీ ఇంజనీరింగు ఎలక్ట్రికల్ పరికరాలను తయారుచేసేందుకూ వినియోగిస్తారు. ఈ దశలో ఒక్కొక్కటి పదిలక్షల టన్నుల ఉక్కును ఉత్పత్తిచేయగల రూర్కెలా, భిలాయ్, దుర్గాపూర్ ఉక్కు కర్మాగారాలు ఏర్పడతాయి. మైసూరు ఇనుము - ఉక్కు పరిశ్రమ యింకా అభివృద్ధిచేయబడుతుంది. ఫలితంగా ప్రభుత్వరంగంలో 1960–'61 నాటికి 20 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి జరుగుతుంది.

చిత్తరంజన్ లోకొమోటివ్ ఫ్యాక్టరీని అభివృద్ధిచేయడం వలన యిప్పుడు అది సాలీనా తయారుచేస్తున్న 125 ఇంజన్లకు బదులు 300 ఇంజన్లు తయారుచేస్తుంది. పెరంబూరు కోచ్‌ఫ్యాక్టరీ 350 రైలు పెట్టెల్ని తయారుచేస్తుంది. మీటరుగేజి పెట్టెలకు మరొక ఫ్యాక్టరీనికూడా పెట్టజూస్తున్నారు. ప్రయివేట్ రంగంలో టాటా ఉక్కు కర్మాగారమూ, ఇంజన్లు తయారు చేస్తున్న ఫ్యాక్టరీ మరింతగా అభివృద్ధి చెందుతాయి.

గనులకొరకు ప్రభుత్వరంగంలో జరిగే ఖర్చు రు. 73 కోట్లూ ముఖ్యంగా బొగ్గు, నూనె గనుల కొరకూ, భూగర్భ పరిశోధన కొరకూ ఖర్చుపెట్టబడుతుంది. ఇప్పుడు ఉత్పత్తి అవుతున్న 3 కోట్ల 80 లక్షల టన్నుల బొగ్గులో 45 లక్షల టన్నులు మాత్రమే ప్రభుత్వరంగాన వున్నది. వచ్చే అయిదేళ్ళలో 2 కోట్ల 20 లక్షలు ఎక్కువ ఉత్పత్తి జరగాలనీ, ఆ పెరుగుదలలో 120 లక్షల టన్నుల బొగ్గు ప్రభుత్వరంగంయొక్క భాగంగావుండాలనీ ఆలోచిస్తున్నారు. బొగ్గు అవసరాన్ని ప్రత్యేకంగా దృష్టిలోపెట్టుకొని, బహుళ ప్రయోజనకారి కాగల నైవెలి లిగ్నైట్ ప్రాజెక్టును తమిళ నాడులో నిర్మిస్తున్నారు.

## రాష్ట్రాలవారీగా మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికకాలాల్లో పెట్టుబడి (కోట్ల రూపాయల్లో)

| రాష్ట్రం | మొదటి ప్రణాళిక | రెండవ ప్రణాళిక |
|---|---|---|
| ఆంధ్ర | 75.9 | 119.0 |
| అస్సాం | 28.1 | 57.9 |
| బీహారు | 104.4 | 194.2 |
| బొంబాయి | 181.3 | 266.2 |
| మధ్యప్రదేశ్ | 57.5 | 123.7 |
| మద్రాసు | 97.0 | 173.1 |
| ఒరిస్సా | 85.2 | 100.0 |
| పంజాబు | 124.0 | 126.3 |
| ఉత్తరప్రదేశ్ | 165.9 | 253.1 |
| ప. బెంగాలు | 151.9 | 153.7 |
| హైద్రాబాద్ | 57.0 | 100.2 |
| మధ్యభారత్ | 36.1 | 67.3 |
| మైసూరు | 53.2 | 80.6 |
| పెప్సు | 39.2 | 36.3 |
| రాజస్తాన్ | 62.8 | 97.4 |
| సౌరాష్ట్ర | 29.8 | 47.7 |
| తిరువాన్కూరు - కొచ్చిన్ | 35.4 | 72.0 |
| జమ్మూ - కాశ్మీరు | 13.2 | 33.9 |
| అజ్మీర్ | 3.6 | 7.9 |
| భోపాల్ | 9.3 | 14.3 |
| కూర్గ | 2.0 | 3.8 |
| ఢిల్లీ | 10.5 | 17.0 |
| హిమాచలప్రదేశ్ | 7.5 | 14.7 |
| కచ్ | 4.8 | 7.9 |

| రాష్ట్రం | మొదటి ప్రణాళిక | రెండవ ప్రణాళిక |
|---|---|---|
| మణిపూర్ | 2.2 | 6.2 |
| త్రిపురా | 3.0 | 8.5 |
| వింధ్యప్రదేశ్ | 9.3 | 24.9 |
| అండమాన్, నికోబార్ దీవులు | 1.5 | 5.9 |
| ఈశాన్య సరిహద్దు ఏజన్సీ | 4.4 | 9.5 |
| పుదుచ్చేరి | 0.8 | 4.8 |
| దామోదరలోయ ప్రాజెక్టుపై కేంద్రం ఖర్చుపెట్టేసొమ్ము | — | 12.2 |
| జాతీయ విస్తరణ, కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజెక్టులు | — | 0.7 |
| మొత్తం | 1456.8 | 2240.9 |

ఇప్పుడు 43 లక్షల టన్నులుగానున్న సిమెంటు ఉత్పత్తి 130 లక్షల టన్నులవరకూ పెరగాలని ముసాయిదా సూచిస్తోంది.

వాడకపు వస్తువుల ఉత్పత్తిని పెంచేవిషయంలో, బట్టల ఉత్పత్తిని 24 శాతం పెంచాలని ఆలోచన. అంటే 685 కోట్ల గజాల బట్ట యిప్పుడు ఏటా ఉత్పత్తి అవుతూంటే, రెండవ ప్రణాళిక కాలంలో అది 850 కోట్లవరకూ పెరుగుతుంది. అదనంగా పెరిగే 170 కోట్ల గజాల బట్టకుగాను మిల్లులు యిప్పుడు ఉత్పత్తి చేసేదానికంటే 35 కోట్ల గజాలు ఎక్కువ చేయవచ్చని ప్రభుత్వం సూచిస్తోంది. అందుకు అవసరమైన విధంగా యంత్రాలను అభివృద్ధిచేసుకోవడానికీ, కొత్తవాటిని తెప్పించుకోడానికీ ప్రయివేట్ పారిశ్రామిక వేత్తలకు అవకాశం కల్పించింది. పోగా పవర్ మగ్గాలను కొత్తగా ప్రవేశపెట్టి వాటి ద్వారా కొంతబట్టను ఉత్పత్తి చేయాలనీ, మిగతాది చేనేతద్వారా ఉత్పత్తి జరగాలనీ ప్రభుత్వం ఆశిస్తోంది. నూలు ఉత్పత్తిని ఎక్కువ

చేస్తూ ఎక్కువమందికి పని కల్పించే దృష్టితో, అంబర్ చరఖాలను 7 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ప్రవేశపెట్టదలచింది ప్రభుత్వం. ఈ ప్రయత్నాలవలన వందకోట్ల గజాల బట్ట ఎగుమతులకు పోగా, దేశంలో సగటున మనిషి 1కి 18 గజాల చొప్పున బట్ట ఉత్పత్తి అవుతుంది.

పంచదార ఉత్పత్తి 35 శాతం పెరుగుతుంది. కాగితం రెట్టింపు ఉత్పత్తి అవుతుంది. 16 లక్షల నుండి 21 లక్షల టన్నుల వరకూ వెజిటబుల్ ఆయిల్సు (నూనె) ఉత్పత్తి పెరుగుతుంది.

రెండవ ప్రణాళిక ఫలితంగా పారిశ్రామిక రంగంలో ప్రయివేటుగాని, ప్రభుత్వపరంగాగాని ఫ్యాక్టరీ ఉత్పత్తి నూటికి 64 వంతులు ఎక్కువవుతుంది. ప్రభుత్వం తన దృష్టిని భారీ పరిశ్రమలపై కేంద్రీకరిస్తున్నందున, ఆ వుత్పత్తి నూటికి నూటపభై పాళ్లు ఎక్కువవుతుంది.

గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలకొరకు ఖర్చుపెట్టే రు. 200 కోట్లలో రు. 59½ కోట్లు చేనేతకూ, రు. 55½ కోట్లు ఖద్దరుకూ, రు. 55 కోట్లు చిన్నతరహా పరిశ్రమలకూ, మిగిలినది మిగతా కుటీర పరిశ్రమలు మొదలైనవాటికీ ఖర్చుపెడతారు.

## రవాణా సౌకర్యాలు

ఈ రంగంలో గత ప్రణాళికలో ఖర్చుపెట్టినది నూరింట 24 వంతుకాగా, యిప్పుడు 29 వంతులవరకూ ఖర్చుకు ప్లాను వేశారు. ఇందుకయ్యే మొత్తం రు. 1385 కోట్లలో రు. 900 కోట్లు రైల్వే శాఖకే ఖర్చవుతుంది.

ఇప్పుడు రైల్వేలలోవున్న పెట్టుబడి మొత్తం రు. 974 కోట్లు. మరొక రు. 900 కోట్లు ఖర్చుపెట్టి, వచ్చే అయిదు సంవత్సరాల్లోనూ రైల్వే రవాణా సదుపాయాన్ని 12 కోట్ల టన్నులనుండి 18 కోట్ల 10 లక్షల టన్నులవరకూ పెంచదలచారు. ప్రయాణీకుల వసతి నూరుమందికి నూటముగ్గురు ప్రయాణం చేయగలిగినట్లుగానే

వుంటుంది. 1607 మైళ్లు డబుల్ లైను వేయడం, 265 మైళ్లు మీటరు గేజ్ లైనును బ్రాడ్ గేజ్ లైనుగా మార్చడం, 842 మైళ్ళు కొత్త లైనువేయడం, 8 వేల మైళ్లు చెడిపోయిన లైనును బాగుచేయడం జరుగుతుంది.

పోగా మిగిలిన మొత్తంలో రు. 263 కోట్లు రోడ్డు రవాణా సదుపాయాలకు, రు. 96 కోట్లు ఓడల నిర్మాణం, రేవు పట్టణాల అభివృద్ధి మొదలైనవాటికీ, రు. 43 కోట్లు వైమానిక సదుపాయాలకూ, రు. 76 కోట్లు రేడియో, పోస్టు టెలిగ్రాఫ్ మొదలుగాగల వాటికీ ఖర్చుపెట్టబడుతుంది.

రోడ్డు రవాణాశాఖలో గత ప్రణాళికలో రు. 155 కోట్లు ఖర్చుపెట్టగా, యిప్పుడు రు. 246 కోట్లు ఖర్చుచేయా లనుకుంటున్నారు. గత ప్రణాళిక కాలంలో ప్రారంభమైన పనులను పూర్తి చేస్తూ, ఇంకా 60 పెద్ద బ్రిడ్జీలను కడతారు. 600 మైళ్ళు రహదారులను కలిపే కొత్తరోడ్లు వేస్తారు. 1700 మైళ్ళ రోడ్లను బాగు చేస్తారు. 3 వేల మైళ్ళ రోడ్లను వెడల్పుచేస్తారు.

రోడ్డు రవాణా మొత్తంగానూ, ప్రయాణీకుల ప్రయాణ సదుపాయంలో ముప్పాతికభాగమూ ప్రయివేట్ వ్యాపారంక్రిందనే సాగుతోంది. రవాణా సదుపాయాన్ని ప్రయివేట్ వ్యాపారంగానే వుంచుతూ, బస్సు ప్రయాణ సదుపాయాల్ని యింకా ఎక్కువగా జాతీయంచేయమని ప్రణాళికా సంఘం సూచిస్తోంది. ఇందుకుగాను, జాతీయమైన రహదారులలో 5 వేల బస్సులు ఎక్కువవుతాయని ఆశిస్తోంది.

పెద్ద ఓడరేవులకు రు. 40 కోట్లు ఖర్చుపెట్టి అభివృద్ధి చేస్తారు. దానివలన నూరింట 30 పాళ్లు ఎక్కువగా ఎగుమతి, దిగుమతి సదుపాయాలను ఆ రేవులు కలిగిస్తాయి. చిన్న రేవులను కూడా అభివృద్ధిచేస్తారు.

నౌకా నిర్మాణానికి రు. 45 కోట్లు ఖర్చుపడతారు. విశాఖపట్నంలోని హిందుస్తాన్ షిప్‌యార్డును అభివృద్ధి చేస్తూ మరొక

షిప్ యార్డ్సను కట్టేవిషయం ఆలోచిస్తారు. ఇప్పుడు మన ఓడ వ్యాపారశక్తి 6 లక్షల టన్నులవరకూ వుంటుందనీ, అది 9 లక్షల టన్నులవరకు ప్రణాళికకాలంలో పెరుగుతుందనీ ముసాయిదా అంచనా వేస్తోంది.

మొదటి ప్రణాళికకాలంలో 36 వేలనుండి 55 వేలవరకూ పోస్టాఫీసుల సంఖ్య పెరిగింది. రెండవ ప్రణాళికకాలంలో అది 75 వేలవరకూ పెరుగుతుందని అంచనా. టెలిఫోనులసంఖ్య 2,70,000 నుండి 4,50,000 వరకూ పెరుగుతుంది. ఇంకా 1200 పబ్లిక్ కాల్ ఆఫీసులు, 1400 టెలిగ్రాఫ్ ఆఫీసులు చేరతాయని అంచనా.

రేడియో కార్యక్రమాలకు మొదటి ప్రణాళికలో రు. 494 లక్షలు ఖర్చుపెట్టగా యిప్పుడు రు. 9 కోట్లు ఖర్చుపెట్టేందుకు అంచనా వేశారు. ఢిల్లీలో ఇదివరకున్న ట్రాన్సుమిటర్లస్థానే యింకా శక్తివంతమైన ఒక్కొక్కటి 100 కిలోవాట్ల శక్తిగల-3 ట్రాన్సుమిటర్లను ఏర్పరుస్తారు. దేశానికంతటికీ ఉపయోగపడే రీతిగా మద్రాసు, బొంబాయి, కలకత్తా స్టేషన్లలో 50 కిలోవాట్ల శక్తిగల యంత్రాలను అమర్చుతారు.

## వ్య వ సా య ం

గత ప్రణాళిక కాలంలో వ్యవసాయం, సామాజికాభివృద్ధి కేంద్రాలకు జరిగిన ఖర్చుమొత్తం ఖర్చులో 15% కాగా, యీ సారి అది 12% గా మార్చబడ్డది. అప్పుడు రు. 357 కోట్లు ఖర్చు కాగా యిప్పుడు యీ అంశాలక్రింద రు. 568 కోట్లు ఖర్చుచేస్తారు. ఇందులో రు. 200 కోట్లు సామాజికాభివృద్ధి కేంద్రాలకు పోతుంది. మిగతా మొత్తం వ్యవసాయాభివృద్ధికి, పశుపోషణ శాఖకూ, అటవీశాఖకూ, మత్స్యశాఖకూ, సహకారశాఖ మొదలగువాటికీ ఖర్చుచేయబడుతుంది.

వ్యవసాయ పంటలు మొదటి ప్రణాళిక కాలంలో 15 శాతం ఎక్కువయ్యాయి. 1960 నాటికి యిప్పుడున్న పంటలపై యింకా

40 శాతం ఉత్పత్తి అధికం కావాలని ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకుంది. (ముసాయిదా తయారయ్యేనాటికి 18 శాతం అని మాత్రం చేర్చింది. తర్వాత 40 శాతం అంటోంది). ఆహార పదార్థాలు యిప్పుడు ఆరున్నర కోట్ల టన్నులు వుత్పత్తి అయితే, 5 సంవత్సరాలనాటికి మరొక కోటి టన్నుల ఉత్పత్తిని పెంచాలని ఆశిస్తోంది ముసాయిదా ప్రణాళిక. ఇప్పుడు తల ఒక్కటికి రోజుకు 17.2 ఔన్సుల ఆహారం ఉత్పత్తి అయితే, అప్పుడు 18.3 ఔన్సులు అవుతుంది. నూనె గింజలు 27 శాతం, పత్తి 31 శాతం, జనపనార 25 శాతం యింకా పెంచాలని ప్రణాళిక సూచిస్తోంది. ఇరిగేషన్ సదుపాయాలు కలిగించి మరొక పది లక్షల ఎకరాలలో చెరుకు పండిస్తే అది పంచదారను ఎక్కువ ఉత్పత్తి చేయడానికి ఉపయోగిస్తుంది. ఇప్పుడు మనిషికి సగటున 1.4 ఔన్సులుగావున్న పంచదార వాడకం 1.7 ఔన్సులకు పెరుగుతుంది.

పారిశ్రామికాభివృద్ధి జరగాలంటె అవసరమైన ముడిసరుకు వగైరా సప్లయి చేసేందుకు వ్యవసాయోత్పత్తి అధికం కావడం అవసరం. ఈదృష్టితో, పదిసంవత్సరాల కాలంలో యిప్పటిపంటలు రెట్టింపు పెరగడం అత్యావసరం అని ప్రణాళికా సంఘం భావిస్తోంది. ఈ అధికోత్పత్తి ప్రయత్నంలో ఇరిగేషన్ సదుపాయాలు ప్రథమ స్థానం పొందుతాయి. వచ్చే అయిదు సంవత్సరాల్లో 210 లక్షల యెకరాలకు అదనంగా నీటి వసతి కలుగుతుంది. ఎరువుల సప్లయి 1955 లో 6 కోట్ల 10 లక్షల టన్నులుకాగా, 1960 లో 10 కోట్ల 80 లక్షల టన్నులకు పెరుగుతుంది. 93 వేల ఎకరాలుగల 3 వేల విత్తన అభివృద్ధి క్షేత్రాలు ఏర్పరచబడతాయి. 35 లక్షల ఎకరాల బీళ్ళు దున్నుతారు.

పశుగణానికి సరిపోయిన మేత దేశంలో లేదు. ఉన్న పశువుల్లో మూడింట రెండువంతులకు మాత్రమే సరిపోతుంది మేత. ఈమేత కొరతవలన మేలురకం పశువులు తయారు గాకపోవడం, పనికీ పాలకూ లోటురావడం జరుగుతోంది. పశుపోషణకు సరిపోయిన

నేత లేని కారణాన గోవధ నిషేధచట్టం పెట్టాలని ఆలోచించి, రాష్ట్ర ప్రభుత్వాలు యీ సమస్యనుకూడా దృష్టిలో పెట్టుకొని ఆలోచించాలని ప్రణాళిక హెచ్చరించింది. మొదటి ప్రణాళిక కాలంలో 600 "కీ గ్రామాలను" (పశుఆస్పత్రులు, పోషణశాలలు) 150 కృత్రిమ బీజోత్పత్తి శాఖలను ప్రభుత్వం ఏర్పరచింది, ఆ సంఖ్యలకు యింకా 1258 "కీగ్రామాలు", 245 బీజోత్పత్తి కేంద్రాలు తోడవుతాయి. వెటరినరీ ఆస్పత్రులు 2650 నుండి 4550 వరకూ పెరుగుతాయి.

చేపలుపట్టేవారు ప్రస్తుతం సముద్రపు ఒడ్డునుండి 10 మైళ్ళ వరకూ మాత్రమే పోయి పడుతున్నారు. యంత్ర పరికరాల పద్ధతిని ప్రవేశపెడితే, యింకా లోతుకు పోయి చేపలు పట్టవచ్చు. సహకార సంఘాలద్వారా యంత్ర పరికరాలను ఉపయోగించే ఏర్పాట్లు చేయాలని ప్రయత్నం జరుగుతోంది. చేపలు పట్టడం, వాటిని నిలవచేయడం మొదలుగాగల పనులకు ప్రణాళికలో 12 కోట్ల రూపాయలను కేటాయించారు. ఇప్పటికన్నా 3 వ వంతు ఎక్కువ చేపల్ని పట్టే ఏర్పాట్లు చేస్తారు.

## సహకార సంఘాలు

సహకార సంఘాలద్వారా పరపతి సదుపాయాలను ఎక్కువ చేసేందుకూ, మార్కెటు సదుపాయాలను, సరకు నిలవచేసుకునే వేర్‌హౌస్ సదుపాయాలను పెంచేందుకూ 47 కోట్ల రూపాయలు ఖర్చు చేయబడతాయి. ఇదిగాక, స్టేట్ బ్యాంకి ద్వారాను క్రెడిట్ సొసైటీలద్వారాను అప్పుల వసతి కలిగిస్తారు. సహకార పరపతి సంఘాలు 60 లక్షలనుండి 150 లక్షల వరకూ పెంచబడతాయి. పెద్ద పరపతి సంఘాల సంఖ్య 10,400 వుంటుంది. దీర్ఘకాల వాయిదాలమీద గాని, తక్కువ కాల వాయిదాలమీద గాని లభించే అప్పుల సదుపాయం 225 కోట్లు వుంటుంది. 1960 నాటికి యిప్పుడున్న మార్కెట్ల సంఖ్య రెట్టింపు అవుతుంది. అమ్మకానికి పోయే సరుకులో 10 వ వంతు సహకార మార్కెటింగు వసతి ద్వారా

జరుగుతుంది. ఈ కాలంలో 1800 మార్కెటింగు సొసైటీలు, 35 సహకార పంచదార ఫ్యాక్టరీలు, 48 ప్రత్తి ఫ్యాక్టరీలు ఏర్పరచ బడతాయి. దేశమంతటా సరుకు నిల్వచేసుకునే 350 వేర్‌హౌస్‌లు ఏర్పరచబడతాయి. ఇవిగాక సొసైటీల క్రిందవుండే గోదాములు 5500.

## సామాజికాభివృద్ధి కేంద్రాలు

ఈ కార్యక్రమానికి ప్రణాళికాసంఘం అత్యంత ప్రాధాన్యం యిస్తోంది. గత ప్రణాళికలో రు. 90 కోట్లు ఖర్చుపెట్టగా, యిప్పుడు యీ కార్యక్రమానికి రు. 200 కోట్లు ఖర్చు పెట్టదలచారు. మొదటి ప్రణాళికకాలంలో 300 సామాజికాభివృద్ధి కేంద్రాలు, 900 జాతీయ విస్తరణ కేంద్రాలు పనిచేసి 8 కోట్ల మంది ప్రజలతో కూడిన 1,23 000 గ్రామాలలో అభివృద్ధి కార్యకలాపాలు సాగిం చాయి. నూరింట 60 వంతుల సహాయం ప్రజలనుండి లభ్యమైందని ముసాయిదా ప్రణాళిక ప్రకటిస్తోంది. 3800 జాతీయ విస్తరణ కేంద్రాలను ఏర్పరచి, అందులో 1120 కేంద్రాలను సామాజికాభి వృద్ధి కేంద్రాలుగా రానురాను అభివృద్ధిచేస్తూ, వచ్చే అయిదు సంవత్సరాలలో దేశమంతటా యీ కార్యకలాపం కొనసాగించా లని ప్లాను. సహకారశాఖాభివృద్ధి, పంచాయితీలు మొదలైన గ్రామ సంస్థల అభివృద్ధి, వ్యవసాయ క్షేత్రాలను చీలకుండా సంఘటిత పరచడం, చిన్నతరహా పరిశ్రమలను అభివృద్ధిచేయడం, ఆర్థికం గానూ సాంఘికంగాను బలహీనంగావున్న ప్రజలను సముద్ధ రించడం, యువజన మహిళాభివృద్ధికి, కొండజాతులవారికొరకు పాటుబడడం యీ కేంద్రాలకు కార్యక్రమంగావుంటుంది.

## పంచాయితీలు

మొదటి ప్రణాళిక కాలంలో 83 వేలనుండి గ్రామపంచాయి తీల సంఖ్య 1,17,000 కు పెరిగింది. ఈ సంఖ్య 1960 నాటికి 2,45,000 అవుతుందని అంచనా. గ్రామపంచాయితీలు అభివృద్ధి

కార్యకలాపాల్లో ఎక్కువగా కృషి చేసేందుకు ప్రభుత్వం 12 కోట్ల రూపాయలు ఖర్చుపెడుతుంది. స్థానిక అభివృద్ధి కార్యక్రమాల కోసం మరొక రు. 15 కోట్లు కేటాయించబడివున్నది. వ్యవసాయ సంస్కరణలనూ, జాతీయవికాస కేంద్రాల కార్యక్రమాన్నీ సాధ్యమైనంత యెక్కువగా పంచాయితీలద్వారా కొనసాగించాలని ముసాయిదా ప్రణాళిక సూచిస్తోంది.

## ఇరిగేషన్

గత ప్రణాళికా కార్యక్రమంద్వారా 510 లక్షల యకరాల నుండి 670 లక్షల యకరాలకు ఇరిగేషన్ సదుపాయాలు కలిగాయి. ఈ ప్రణాళిక కాలంలో మరొక 210 లక్షల యకరాలకు ఆ సదుపాయం కలుగుతుంది. ఇందులో 90 లక్షల యకరాలు మొదటి ప్రణాళిక కాలంలో ప్రారంభించిన ప్రాజెక్టులను పూర్తిచేయడం ద్వారా సాగులోకి వస్తాయి. మొత్తం 210 లక్షల యకరాలలో 120 లక్షల యకరాలు పెద్దప్రాజెక్టులద్వారాను, 90 లక్షల యకరాలు మైనరు ఇరిగేషను వసతులద్వారాను నీటిని పొందుతాయి.

ఒక్కొకదానికి 30 కోట్లకుపైగా ఖర్చయ్యే 7 ప్రాజెక్టులనూ, పదీ ముప్ఫయికోట్ల రూపాయల మధ్య ఖర్చయ్యేవాటిని ఆరింటినీ, పదికోట్ల రూపాయలకులోపు ఖర్చయ్యే వాటిని 54 గింటనీ, ఒకకోటి రూపాయలకు లోపు ఖర్చయ్యే వాటిని 200 నూ మొదటి ప్రణాళిక ప్రారంభించింది. రెండవ ప్రణాళిక ప్రారంభించే 188 ప్రాజెక్టులలో రు. 30 కోట్లకు మించినదేదీ లేదు. రు. 10–30 కోట్ల మధ్యఖర్చయ్యేవి 10, రు. 1–10 కోట్లమధ్య ఖర్చయ్యేవి 42, ఒకకోటి రూపాయలలోపువి 136 ప్రాజెక్టులు ఉన్నాయి.

మైనరు ఇరిగేషన్ ఖర్చులో 20 కోట్ల రూపాయలను 3581 గొట్టపు బావులకు ఖర్చుచేస్తారు.

## విద్యుచ్ఛక్తి

పారిశ్రామికాభివృద్ధి ఎక్కువగా జరగవలసినందున, అందుకు విద్యుచ్ఛక్తిని ఎక్కువగా ఉత్పత్తిచేయడంకూడా అవసరమే. వచ్చే అయిదేళ్ళలో ఆశక్తి రెట్టింపు కావాలి. '51 లో 230 కిలో వాట్ల ఉత్పత్తిశక్తి వుంటే అది మొదటి ప్రణాళిక ఆసాంతానికి 340 కిలోవాట్ల శక్తిగా అభివృద్ధిచెందింది. 1960–'61 నాటికి యీ శక్తి 690 లక్షల కిలోవాట్లు కావాలి. దానితో మనిషి ఒకటికి సగటు విద్యుచ్ఛక్తి వాడకం 14 యూనిట్లనుండి 25 యూనిట్లకు యింతవరకు పెరగగా, యికముందు 50 యూనిట్లకు పెరుగుతుంది. మొదటి ప్రణాళిక ద్వారా 20 వేలకు పైగా జనాభాగల పట్టణా లలో 95 శాతమూ, 10–20 వేలమధ్య జనాభాగల పట్టణాలలో 40 శాతమూ విద్యుచ్ఛక్తిని పొందాయి. 10 వేలపై జనసంఖ్య గల అన్ని పట్టణాలకూ, 5–10 వేల మధ్య జనాభాగల పట్టణాలలో 85 శాతంకూ విద్యుచ్ఛక్తిని సరఫరాచేయాలని యీ ప్రణా ళిక ఆశిస్తోంది. గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేసేందుకు యిప్పుడు రు. 75 కోట్లు కేటాయిస్తున్నారు. అందుమూలంగా విద్యుచ్ఛక్తి పొందే గ్రామాలసంఖ్య 5300 ల నుండి 13900 వరకూ పెరుగుతుంది.

1956 నాటికి విద్యుచ్ఛక్తి కంపెనీలలో రు. 270 కోట్లుగా వున్న ప్రభుత్వ పెట్టుబడి 1960 నాటికి రు. 680 కోట్లకుపెరుగు తుంది. ఆనాటికి ఉత్పత్తి అయ్యే మొత్తంశక్తి 690 లక్షల కిలో వాట్లలో ప్రభుత్వ కంపెనీలద్వారా 430 లక్షల కిలోవాట్లు ఉత్పత్తి అవుతుంది. అంటే 67 శాతం ప్రభుత్వరంగంలో వుంటుంది.

## విద్య

సాంఘికసేవా శాఖలకు యీ ప్రణాళిక రు. 945 కోట్లు కేటాయించింది. ఇది మొదటి ప్రణాళికలో పెట్టినదానికి రెట్టింపు.

విద్యకొరకు గత ప్రణాళికలో రు. 169 కోట్లు ఖర్చుపెట్టగా, యిప్పుడు రు. 307 కోట్లు ఖర్చుచేయ తలపెట్టారు. ఇందులో ఎలిమెంటరీ విద్యకు రు. 89 కోట్లు, సెకండరీ విద్యకు రు. 51 కోట్లు, యూనివర్సిటీ విద్యకు రు. 57 కోట్లు, సాంకేతిక విద్యకు రు. 48 కోట్లు, సాంఘిక విద్యకు రు. 5 కోట్లు, పరిపాలనా వ్యవహారాలకు రు. 57 కోట్లు ఖర్చుచేస్తారు.

6–11 సంవత్సరాలమధ్య వయస్సుగల పిల్లలు యిప్పుడు బడికి వెళుతున్నవారు 2,48,12,000. 1960–'61 నాటికి యీ సంఖ్య 3,25,40,000 కు పెరుగుతుంది. 11–14 సంవత్సరాలమధ్య వయస్సు వారు ఇప్పుడు 50,95,000 మంది బడికి వెళుతూండగా, 1960–'61 నాటికి 63,87,000 వెళతారు. 14–17 సంవత్సరాలమధ్య వయస్సు వారు ఇప్పుడు 23,03,000 మంది బడికి వెళుతూండంగా, 1960–'61 నాటికి 30,70,000 మంది వెళతారు. అంటే మొత్తం దేశంలో 6–11 సంవత్సరాల వయస్సుగల పిల్లలలో ఇప్పుడు 51 శాతం, 1960–'61 నాటికి 62.7 శాతం బడికి వెళుతూంటారు. 11–14 మధ్య వారిలో యిప్పుడు 19.2 శాతం అప్పటికి 22.5 శాతం బడికి వెళుతూంటారు. 14–17 మధ్య వయస్సువారిలో యిప్పుడు 9.4 శాతం, అప్పటికి 11.7 శాతం ఉన్నతవిద్య నభ్యసిస్తూంటారు.

ప్రణాళిక కాలంలో 53 వేల ప్రాథమిక పాఠశాలలు, 3500 మాధ్యమిక పాఠశాలలు కొత్తగా యేర్పడతాయి. ఇంత వరకూ విద్యావ్యాప్తి సాగించాలన్నా షిఫ్ట్‌పద్ధతిని స్కూళ్ళునడపడం అవసరం అనీ, బిల్డింగు వసతికై యీ కాలంలో అంతగా ఖర్చుచేయలేమనీ ముసాయిదా సూచిస్తూంది. ఉన్నతవిద్య నభ్యసించే విద్యార్థులసంఖ్య 23 లక్షలనుండి 31 లక్షల వరకూ పెరుగుతుంది.

పాలిటెక్నికల్ స్కూళ్ళద్వారా సాంకేతిక శిక్షణ యిచ్చేందుకు ఎక్కువగా శ్రద్ధచూపబడుతుంది. ఒక మెకానిక్ శిక్షణ కేంద్రం నాగార్జునసాగర్ వద్ద నిర్మించబడుతుంది. సాంకేతికవిద్యా

సంస్థలు 128 నుండి 155 వరకూ పెంచబడతాయి. 18 ఇంజనీరింగు కాలేజీలనూ, 62 ఇంజనీరింగు స్కూళ్ళనూ తెరుస్తారు. ఇంజనీరింగు పట్టభద్రులు 1955 లో 3 వేలు తయారు కాగా, 1960 నాటికి ఏటా 5480 మంది తయారవుతారు. డిప్లమాహోల్డర్ల సంఖ్య 3560 నుండి 8 వేల వరకు పెరుగుతుంది.

## ఉ పా ధ్యా యు లు

ప్రస్తుతం ఉపాధ్యాయులు తాత్కాలికంగా మరొక ఉద్యోగం దొరికేవరకూ వుండి వెళ్లి పోతున్నారు. వారిలో స్థాయికలిగినవారికి యితర ఉద్యోగాలలో ఎంత ప్రతిఫలం వస్తున్నదో అంతా ఉపాధ్యాయ వృత్తిలోకూడా లభ్యమయేలా చూస్తే యీ పరిస్థితి బాగు పడుతుంది. ప్రాథమికోపాధ్యాయుల జీతాలు పెంచగా అయ్యే ఖర్చులో సగం కేంద్రప్రభుత్వం భరిస్తానంటున్నది. పాఠశాల భవనాలమీద ఖర్చు తగ్గించటం ద్వారానూ, విద్యాసుంకం విధించీ జీతాలు పెంచమని రాష్ట్రప్రభుత్వాలకు సూచిస్తోంది.

## ఆ రో గ్య శా ఖ

మొదటి ప్రణాళికలో యీ శాఖకు రు. 140 కోట్లు ఖర్చయింది. ఇప్పుడు రు. 274 కోట్లు ఖర్చుపెట్ట దలచారు. 1955–'56 లో 10 వేలుగానున్న అన్ని రకాల ఆస్పత్రులు 1960–'61 కి 12,600 వరకు పెరుగుతాయి. మంచాల సంఖ్య 125000 నుండి 1,55,000 వరకూ పెరుగుతుంది.

గ్రామీణ ఆరోగ్య వసతులను అభివృద్ధిచేసే నిమిత్తం గత ప్రణాళికలో 725 ఆరోగ్య కేంద్రాలను ఏర్పరచగా, ప్రణాళిక కాలంలో 3000 కేంద్రాలను ఏర్పాటు చేస్తారు.

ఈ ప్రణాళిక కాలంలో వైద్య విద్యా సదుపాయాలు ఎక్కువ చేసేందుకు రు. 38 కోట్ల వరకూ ఖర్చుపెడుతున్నారు. అయినా 1960 నాటికి అవసరమైన 90 వేల మంది డాక్టర్లకుగాను 82,500 మాత్రమే తయారవుతారు. నర్సులూ, మంత్రసానులూ

చేరి 80 వేలు అవసరంకాగా, 31 వేల మంది నర్సులూ 32 వేల మంది మంత్రసానులూ మాత్రమే వుంటారు. హెల్తు అసిస్టెంట్లు, శానిటరీ యిన్స్పెక్టర్లు 20 వేల మంది అవసరంకాగా, 7 వేల మంది మాత్రమే వుంటారు.

ఆయుర్వేద వైద్య సదుపాయాల నిమిత్తం ఆరున్నరకోట్ల రూపాయలు ఖర్చుపెడతారు. మలేరియా నివారణ నిమిత్తం రు. 28 కోట్లు, ఫైలేరియా నివారణ నిమిత్తం రు. 9 కోట్లు ఖర్చు పెడతారు. 25 సంవత్సరాల లోపువారందరికీ బి. సి. జి. వాక్సినేషన్ పూర్తిచేసే క్షయవ్యాధి నివారణకు పాటు బడతారు. కనీసం జిల్లాకు ఒక క్లినిక్ అయినా ఏర్పాటుచేస్తారు. మొత్తం క్షయవ్యాధి నివారణచర్యలకు రు. 14 కోట్లు ఖర్చు పెడతారు.

బస్తీలలో మంచినీటి వసతులకని రు. 53 కోట్లు, పల్లెపట్టున మంచినీటి సదుపాయాలకు రు. 28 కోట్లు, కార్పొరేషన్లకు ప్రత్యేకంగా రు. 10 కోట్లు కేంద్రప్రభుత్వం కేటాయించింది.

2100 ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలను అదనంగా ఏర్పాటుచేస్తారు.

## జనసంఖ్య

1960 నాటికి దేశంలో జనసంఖ్య 41 కోట్లకు చేరుకుంటుందనీ, 75-76 నాటికి 50 కోట్లకు చేరుకుంటుందనీ ముసాయిదా అంచనా వేస్తున్నది. దేశంలోగల భూమినీ, పెట్టుబడినీ బట్టిచూస్తే ఈ జనసంఖ్య పెరుగుదల చాల పెద్ద సమస్యగా పరిణమిస్తుందని భావిస్తున్నది. కనుక కుటుంబ పరిమితికి సంతాన నిరోధచర్యల్ని ప్రోత్సహిస్తోంది. అందుకు రు. 5 కోట్లు ఖర్చుపెడుతోంది. ఈ కార్యక్రమాన్ని ప్రోత్సహించి అమలు జరిపేందుకు రెండవ ప్రణాళిక కాలంలో 300 క్లినిక్కులను బస్తీలలోనూ, 2000 క్లినిక్కులను గ్రామసీమల్లోనూ ఏర్పాటుచేస్తారు.

## ఇంటివసతి

ఇంటివసతికి మొదటి ప్రణాళికలో రు 38½ కోట్లు ఖర్చు పెట్టగా, యిప్పుడు రు. 120 కోట్లు ఖర్చు పెట్టదలచారు. ఇందులో రు. 29 కోట్లు లేబరుకు సంబంధించిన ఇళ్ళవసతులకు ఖర్చు పెడతారు. మురికిపేటలలోని యిండ్లను పునర్నిర్మించేందుకు రు.20కోట్లు వినియోగిస్తారు. పల్లెపట్టున ఇళ్ళనిర్మాణానికి రు. 10 కోట్లు ఖర్చు పెడతారు. గతప్రణాళికకాలంలో ప్రభుత్వ పరంగా 7 లక్షల ఇళ్ళ వసతి, ప్రయివేట్ నిర్మాణాలద్వారా 6 లక్షల ఇళ్ళవసతి ఏర్పడ్డదని అంచనా. ఈ ప్రణాళికలో ప్రభుత్వపరంగా 11 లక్షలు, ప్రయివేటు నిర్మాణంద్వారా 8 లక్షలు ఇళ్ళవసతి ఏర్పడవచ్చు. గత రెండుదశాబ్దాలలో బస్తీల జనసంఖ్య సాలీనా 4 శాతం పెరగగా, ఇళ్ళవసతి 2½ శాతంవరకు మాత్రమే పెరిగింది. కనుక బస్తీలలో యీ కొరత చాల ఎక్కువగా వున్నది. 1951 లో 25 లక్షల ఇళ్ళకొరత వుండగా 1961 నాటికి యీ కొరత 50 లక్షలకు పెరుగుతుంది.

## వెనుకబడిన వారికి సహాయం

మొదటి ప్రణాళికలో యీ సహాయం రు. 39 కోట్లువున్నది. ఇప్పుడది రు. 91కోట్లు వుంటుంది.ఇందులో రు. 47 కోట్లుషెడ్యూల్డు జాతులకూ, షెడ్యూల్డు ప్రాంతాలకు ఖర్చవుతుంది. రు. 27 న్నర కోట్లు షెడ్యూల్డుకులాల వారికి (హరిజనులకు) ఖర్చు పెట్టబడుతుంది. రు. 4 కోట్లు గతంలో నేరస్థజాతులుగా పరిగణించబడిన వారికీ, రు. 9 కోట్ల 70 లక్షలు యితర వెనుకబడిన తరగతుల వారికీ ఖర్చు చేయబడుతుంది. పరిపాలనా వ్యవహారాలకు రు. 2 కోట్ల 9 లక్షలు ఖర్చవుతుంది.

## సాంఘిక సంక్షేమ శాఖ

ఈ శాఖకు రు. 29 కోట్లు ఖర్చుపెట్ట దలచారు. యువజన సంక్షేమ కార్యక్రమానికీ, శారీరకంగానూ, మానసికంగానూ దెబ్బ

తిన్నవారి పునరావాసంకొరకూ రు. 11 కోట్లు ఖర్చు చేస్తారు. మొదటి ప్రణాళికకాలంలో మహిళా శిశు సంక్షేమ కార్య క్రమానికిగాను 291 సంక్షేమ విస్తరణ కేంద్రాలు ఏర్పడ్డాయి. ఈ ప్రణాళికలో అటువంటి కేంద్రాలను యింకా ప్రతి జిల్లాకు మూడంటిని ఏర్పాటు చేయాలని తలపెట్టారు. 1960–61 నాటికి ఇటువంటి కేంద్రాల సంఖ్య 1320 అవుతుంది.

పాకిస్తాన్ నుండి వచ్చిన నిర్వాసితులకు పునరావాసం కల్పించేందుకు రు. 90 కోట్లు కేటాయించారు.

## నిరుద్యోగ సమస్య

గత ప్రణాళికకాలంలో ఒక కోటిమంది పనులు కావలసినవారు అదనంగా తయారై వుంటారు. అందులో 70 లక్షలమందికి పనులు చూపాలని మొదటి ప్రణాళిక అంచనా. కాని 50 లక్షల మందికే పనులు చూపించ కలిగారు. వచ్చే 5 సంవత్సరాల్లో మరొక కోటిమంది కొత్తగా తయారవుతారు. అదివరకే నిరుద్యోగులుగానూ, పాక్షిక నిరుద్యోగులుగానూ వున్నవారిమాట అటుంచగా, యీ 10 సంవత్సరాలలో పెరిగి ఉద్యోగాలకోసం ఎదురుచూసేవారి సంఖ్య 2 కోట్లు. వారిలో మొదటి ప్రణాళిక కాలంలో 50 లక్షల మందికి పనులు దొరకగా, యిప్పటి ప్రణాళికలో 80 లక్షల మందికి పనులు దొరుకుతాయని ముసాయిదా అంచనా వేస్తున్నది. ఇంకా 70 లక్షల మంది 1960–'61 నాటికి నిరుద్యోగులుగానే మిగిలిపోతారు. ఈ ప్రణాళిక కాలంలోపనులకై ఎదురుచూసే 153 లక్షల మందిలో 63 లక్షలమంది బస్తీలవారు. 90 లక్షలమంది పల్లెటూరివారు. ఇందులో స్కూల్ ఫైనల్‌కుపైన చదువుకున్నవారు 20 లక్షలమంది వుంటారు. ప్రణాళికకాలంలో $14\frac{1}{2}$ లక్షలమంది చదువుకున్నవారికి మాత్రమే వుద్యోగాలు దొరకవచ్చు.

## వ్యవసాయ సంస్కరణలు

పారిశ్రామికాభివృద్ధికి వ్యవసాయోత్పత్తి పెరగటంకూడా అత్యవసరం. కనుక వ్యవసాయోత్పత్తిని పెంచేందుకు నైపుణ్యాన్ని అభివృద్ధి చేయడంతోపాటు, అధికోత్పత్తికి ఆటంకంగా పరిణమించిన వ్యావసాయిక వ్యవస్థలోకూడా మార్పులు తేవాలని ముసాయిదా ప్రణాళిక సూచిస్తోంది.

జమిందారీ, జాగీర్దారీ మొదలు గాగల దళారీలను రద్దు చేయడం, కౌలుదారులకు రక్షణ కల్పించడం, కమతాలకు గరిష్ట పరిమితిపెట్టి, నష్టపరిహారమిస్తూ, అంతకు పైబడినభూమిని పంచడం ద్వారా వ్యవస్థలో అవసరమైన మార్పులు జరుగుతాయని ముసాయిదా భావిస్తోంది. ఇందులో మొదటి కర్తవ్యం పూర్తయినట్లే భావిస్తోంది. కౌలుదారుల రక్షణకు యిదివరకే చట్టాలుచేయని ప్రభుత్వాలు వెంటనే చేయాలని కోరుతోంది. గత మూడు సంవత్సరాల్లో అక్రమంగా భూములనుండి తొలగించబడిన కౌలుదారులకు సాధ్యమైనంతవరకు రక్షణ కల్పించాలని సూచిస్తోంది. పంటలో నాలగవవంతుగాని, అయిదవవంతుగాని కౌలు రేటుగా వుండాలని చెబుతోంది. కొన్ని పరిమితులలో స్వంతసేద్యానికి భూమిని వదలాలనీ, స్వంతసేద్యానికి వచ్చే భూమిపోను మిగతా భూమిని, చేసే కౌలుదారులకు ఏటా కౌలు రేటుకు మించని పరిహారాన్నీ, వడ్డీనీ 20 వాయిదాలమీద ప్రభుత్వం వసూలుచేసి, భూస్వామికి యివ్వాలనీ ముసాయిదా ప్రణాళిక ప్రకటిస్తోంది. స్వంతసేద్యానికి యిచ్చే నిర్వచనంలో మేనేజిమెంటు చేసుకుంటే సరిపోతుందనీ, "స్వయం కృషి" చేస్తేనే స్వంత సేద్యం క్రిందికి రావాలనే షరతు అక్కర లేదనీ ప్రకటిస్తోంది.

పోతే గరిష్ట పరిమితి నియామకం వెంటనే జరగాలని ముసాయిదా ప్రణాళిక ఆదేశిస్తున్నది. ఇకముందు అభివృద్ధి అయ్యే క్షేత్రాలకేగాక, యిప్పుడున్న క్షేత్రాలకు కూడా యీ పరిమితిని వర్తింపచేయాలని కోరుతోంది. మూడు కుటుంబ కమతాలభూమికి

గరిష్టపరిమితిని వర్తింపజేయాలి. ఆ కుటుంబ కమతం ఎంత అనే విషయం ఆయా ప్రాంతాలనూ, తరహాలనూ, నీటి సదుపాయాలనూబట్టి రాష్ట్ర ప్రభుత్వాలే నిర్ణయించుకోవాలి. గరిష్టపరిమితి ఒకవ్యక్తికి యింతకు మించి వుండరాదని వుండాలా, లేక కుటుంబానికి యింతకు మించి వుండరాదని వుండాలా అనే విషయాన్ని కూడా రాష్ట్ర ప్రభుత్వాలే నిర్ణయించుకోవాలి.

టీ, కాఫీ, రబ్బరు తోటలకూ; ఒకే ఖండంగావున్న పండ్ల తోటలకూ; పశుపోషణ, పాలు, పెరుగు, వున్ని పెంపకాలకు ప్రత్యేకించబడిన క్షేత్రాలకూ; పంచదారమిల్లుల ఆధ్వర్యానవున్న చెరకుతోటలకూ; బాగా పెట్టుబడులుపెట్టి, కట్టడాలుకట్టి ఒకే ఖండంగా వుండి బాగా నడుపబడుతున్న క్షేత్రాలకూ (బద్దలుకొడితే పంట దెబ్బతింటుందనుకుంటే) యీ గరిష్టమిరిమితి వర్తించదు.

గరిష్టపరిమితికి మించిన భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని పంచుతుంది. ఏటా వారినుండి 1/4 లేక 1/5 వంతు ఫలసాయానికి మించని విధంగా నష్టపరిహారం వసూలుచేసి, భూస్వాములకు బాండ్లరూపంలో చెల్లిస్తుంది. భూమి పంపకం సందర్భంలో తొలగించబడిన కౌలుదారులకూ, ఆర్థిక స్తోమతులేని క్షేత్రాలుగల రైతులకూ, వ్యవసాయ కూలీలకూ ముందు పంచాలి.

వ్యవసాయ మేనేజిమెంటు పద్ధతుల్లో మార్పులు రావాలని ముసాయిదా ప్రణాళిక సూచిస్తోంది. కమతాలు చీలిపోకుండా చర్యలు తీసుకోవాలనీ, సహకార పద్ధతిపై సమిష్టి వ్యవసాయం కొనసాగేందుకు ప్రోత్సాహం యివ్వాలనీ తలపెడుతోంది.

## వ్య వ సా య కూ లీ లు

వ్యవసాయంపై ఆధారపడి జీవించే 24 కోట్ల 90 లక్షల మందిలో, 4 కోట్ల 90 లక్షలమంది వ్యవసాయకూలీ జనాభా. వ్యవసాయకూలీలలో నూటికి 15 మంది పాలేర్లకు నిలకడగా సంవత్సరంపొడుగునా పనివున్నది. నూటికి 16 మందికి ఏపనీ లేదు.

మిగతావారికి పాక్షికంగా పనిదొరుకుతూన్నది. సగటున దేశంలో వ్యవసాయకూలీలకు సంవత్సరానికి 7 మాసములకులోపే పని దొరుకుతున్నది. కొన్ని ప్రాంతాలలో పనిదొరికేకాలం మరీ తక్కువగా వుంది. దేశంలో సగటు ఆదాయం రు. 265 ఉండగా, వ్యవసాయకూలీలకు సాలుసరి సగటు ఆదాయం రు.104 మాత్రమే వుంది.

ఈ పరిస్థితుల్ని బాగుచేసేందుకు ముసాయిదా ప్రణాళిక కొన్ని సూచనలు చేస్తోంది.

అవి ఏమంటే: ఫ్యూడల్ హక్కుల్ని తొలగించాలి. తప్పుడుగా పంపకమైన భూసంబంధాలను లేకుండా చేయాలి. దోపిడీచేసి తక్కువకూలి యివ్వడం పోవాలి. ఇతర సాంఘిక యిబ్బందులు తొలగాలి. ఆస్తి ఉన్నవారికీ, లేనివారికీ మధ్య తేడాపోయి, సమాన అవకాశాలు, స్థాయి ఏర్పడాలి.

ఇందుకుగాను ప్రభుత్వ కార్యకలాపాలన్నింటా తక్కువ స్థాయిలో నున్నవారి ఆదాయాలను పెంచేదృష్టితో వ్యవహరించాలని ప్రబోధించింది. లేబరు కో-ఆపరేటివ్ సొసైటీలను తాలూకాల వారిగాకూడ ఏర్పరచి కంట్రాక్టు పనులన్నీ ఆ సొసైటీల కిచ్చేలా చూడాలనీ, కనీసకూలి నిర్ణయచట్టాలు చేయాలనీ కోరింది. వ్యవసాయ కూలీలకు యిళ్ళస్థలాల వసతిని కలిగించే బాధ్యతను గ్రామ ఉమ్మడిగా తీసుకోవాలని చెప్పింది. ఇళ్ళస్థలాలు ఉచితంగా యివ్వాలని సూచించింది.

## కార్మిక విధానం

సోషలిస్టు తరహా సమాజాన్ని దృష్టిలో పెట్టుకుంటే కార్మికులకు న్యాయం జరిగేటట్లు చూడాలనీ, పరిశ్రమల్లో శాంతిని కాపాడటం అత్యవసరమనీ ముసాయిదా ప్రణాళిక సూచిస్తోంది. శిక్షణాయుత ప్రవర్తనను పెంపొందించడం, బాగా పని జరిగే పద్ధతులు చూడడం, అదే సమయంలో లాభాలు న్యాయంగా పంపకం అయ్యేట్లు చూడడం అవసరమని బోధించింది. సంప్రదింపుల

ద్వారానూ, మరీ తెగకపోతే మధ్యవర్తి నిర్ణయం ద్వారానూ తగాయిదాలు పరిష్కరించుకోవాలని సూచించింది. ప్రభుత్వ రంగంలోని కార్మికులకు, ప్రయివేట్ రంగంలోని కార్మికులకు మధ్య తేడా చూపరాదన్నది. రేషనలైజేషన్ కార్మికులకు మానసిక బాధ కలుగజేస్తున్నప్పటికీ, ఉత్పత్తి సాధనాలను అభివృద్ధి చేయకుండా ఆపడం మంచిది కాదని ప్రణాళిక సూచించింది. అయితే కార్మికులతో సంప్రదించి, దానివలన నిరుద్యోగం కలగకుండా చూసి, రేషనలైజేషన్‌కు ప్రయత్నించాలని చెప్పింది. పరిశ్రమల్లో ప్రజాస్వామ్యం వుండాలంటే గట్టి ట్రేడ్ యూనియన్లు అవసరమని చెప్పింది.

## పరిపాలనా యంత్రం

ప్రణాళిక అమలుజరిగేందుకు పరిపాలనా యంత్రంలో మార్పురావాలి. అందుకుగాను ముసాయిదాలో ముఖ్యంగా పేర్కొన్న విషయా లిలా వున్నాయి: ఉద్యోగులలో లంచగొండితనం పోవాలి. పొదుపుగా ఖర్చుచేసి నైపుణ్యంగా పనులుసాగేలా చూడాలి. కేవలం పై ఉద్యోగుల చేతుల్లోనే బాధ్యత కేంద్రీకరించబడకుండా, దిగువవారు చొరవగానూ, బాధ్యతతోనూ పని చేయగలిగేటట్లు విభజించబడాలి. గ్రామ ప్రణాళికల నిర్వహణకు పంచాయితీలు ముందుకురావాలి. జిల్లాలలో శాంతి భద్రతల విషయంతప్ప, మిగతా ప్రభుత్వ కార్యకలాపాలలో సలహా లిచ్చేందుకు ప్రజాస్వామిక సంస్థలను ఏర్పాటుచేస్తే మంచిది. ప్రజలు ప్రణాళిక కార్యకలాపాలలో ఎక్కువగా పాల్గొనేట్లు ప్రభుత్వోద్యోగులు చూడాలి.

## ఆదాయపు వనర్లు

రెండవ ప్రణాళిక అమలు జరిగేందుకు ప్రభుత్వరంగంలో అవసరమైన మొత్తం 4800 కోట్ల రూపాయలు. ఇందులో రు. 350 కోట్లు గతంలో వసూలయ్యే పన్నులలో ప్రణాళిక ఖర్చు

క్రింద కేటాయించబడుతుంది. మరో రు. 450 కోట్లు అదనపు పన్నులద్వారా వసూలుకావాలి. రైల్వేలద్వారా రు. 150 కోట్లూ, ప్రావిడెంటుఫండు నిల్వలు రు. 250 కోట్లూ వుంటాయి. ప్రజలనుండి 700 కోట్ల రూపాయలు ప్రభుత్వం అప్పు పుచ్చుకుంటుంది. కొద్దిపాటి మొత్తాలు నిల్వచేసుకున్న వారి డబ్బు మరో రు. 500 కోట్లుకూడా ప్రభుత్వం అప్పుగా ఉపయోగించుకుంటుంది. రు. 1200 కోట్ల కరెన్సీనోట్లు అచ్చువేసి అదనపు డబ్బును అమలులోకి తెస్తారు. 800 కోట్ల రూపాయలను విదేశాలనుండి సహాయం తెచ్చుకోవాలి. పోగా యింకా లోటుగా వున్న రు. 400 కోట్లుకూడా పన్నులద్వారానే సమకూర్చుకొనవలసి వస్తుంది.

పన్నులు: అదనపు పన్నులద్వారా రు. 850 కోట్లు వసూలుచేయవలసి వస్తుందని ముసాయిదా ప్రణాళిక వెల్లడిస్తోంది. అయినా, యిప్పటికి రు. 450 కోట్ల అదనపు పన్నులకే లెక్కలు కడుతున్నారు. ఈ రు. 450 కోట్లలో రాష్ట్ర ప్రభుత్వాలవంతు రు. 225 కోట్లు. రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదించినమీదట రు. 166 కోట్ల పన్నులు రాష్ట్రాలనుండి వస్తాయని లోగడ అనుకున్నారు. ఇప్పుడు అవసరాన్నిబట్టి దానిని రు. 225 కోట్లకు పెంచారు. శిస్తు పెంపకం, వ్యవసాయాదాయం పన్ను, అభివృద్ధి పన్ను, నీటితీరువా పెంపకం, అమ్మకం పన్ను, విద్యుచ్ఛక్తి పన్ను, మోటారు పన్ను, స్టాంపుడ్యూటీ మొదలైన వాటిద్వారా యీ పన్ను మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు సేకరిస్తాయి. రాష్ట్ర ప్రభుత్వాలు ప్రణాళిక నిమిత్తం ఖర్చుపెట్టే మొత్తంలో వారు సంపాదించగలిగింది నూరింట 40 వంతులు మాత్రమే. మిగత్లాది కేంద్ర వనర్లనుండే ఖర్చుపెట్టాలి.

కేంద్ర ప్రభుత్వం విధించే అదనపుపన్నులలో సంపదపై పన్ను, దానధర్మాలపై పన్ను మొదలైనవి వుండవచ్చు. బాగా ఆదాయాలువచ్చే వారిపై ఆదాయంమీదగాక, ఖర్చుమీద పన్ను

వేస్తే బాగుంటుంది. ఇప్పటికే ఇన్‌కమ్‌టాక్సు చాలా ఎక్కువగా వున్నది గాన, దానివల్ల యింకా సంపాదించగలిగేది ఎక్కువగా వుండదు. లాభాలకు పరిమితి పెట్టాలనే సూచనను అమలుజరిపితే చాల కష్టాలుంటాయి. పరోక్షంగా పర్యవసానంలో అందుకు దారితీసే పద్ధతినే ఆ విషయం ఆలోచించాలి. పన్నులనుగురించి ముసాయిదా ప్రణాళిక సూచనలు పై విధంగా వున్నాయి.

అప్పులు : ప్రజాఋణం రు. 700 కోట్లు సేకరించాలి. గత ప్రణాళికకాలంలో సేకరించినదానికంటె యిది రు. 280 కోట్లు ఎక్కువ. ఈ రు. 700 కోట్లు గాక వెనుకటి ఋణాలు రు. 430 కోట్లవరకు యీకాలంలో తిరిగి చెల్లించవలసియుంటుంది. దానిని తిరిగి అప్పుగా పుచ్చుకుంటున్నారు. రు. 1130 కోట్లుసేకరణ చేయ వలసియుంటుంది. ఇది కష్టతరమేనని ప్రణాళికాసంఘం భావిస్తున్నది.

పోగా, కొద్దిమొత్తాలు పొదుపుచేసుకునేవారి నిలవ యిప్పుడు ఏటా రు. 65 కోట్లుగామాత్రం వుంటోంది. అది ఏటా రు. 100 కోట్లు కావాలని ప్రణాళిక ఆశిస్తోంది.

విదేశీ సహాయం : గత ప్రణాళికకాలంలో సాలీనా రు. 40 కోట్లవరకూ విదేశీ సహాయంగాని అప్పుగాని వచ్చింది. ఈ ప్రణాళికకాలంలో విదేశాలనుండి అప్పుగాగాని, సహాయంగాని ఏటా రు. 160 కోట్లు రావాలి. అవకాశాలతో పోల్చితే యిది పెద్ద లక్ష్యమేనని ప్రణాళికాసంఘం భావిస్తోంది. దీనిలో చాలా అనిశ్చితాలు యిమిడివున్నాయంటోంది.

అదనపు కరెన్సీ : 1200 కోట్ల రూపాయల అదనపు కరెన్సీని చలామణీలోకి తేవడం ద్వారా ప్రణాళిక లక్ష్యాలను సాధించాలనుకుంటున్నారు. దేశసంపద పెరుగుతున్నది గనుక కొంతవరకు కరెన్సీనోట్ల సప్లయి ఎక్కువ చేసినా ఫరవాలేదు. కాని వచ్చే అయిదు సంవత్సరాల్లో జాతీయ సంపద నూటికి 25 పాళ్ళు పెరుగుతుందని అంచనావేయగా, కరెన్సీసప్లయి నూటికి 66 పాళ్ళు పెరుగుతోంది. అందువల్ల నోట్లముమ్మరం యొక్క

ప్రమాదం వున్నది. కొంతవరకు ఆ ప్రమాదానికి సిద్ధంకావలసిందే నంటున్నది ముసాయిదా. ఎక్కువగా సప్లయి అయిన డబ్బును అప్పులద్వారానూ, అదనపు పన్నులద్వారానూ ప్రజలనుండి తిరిగి రాబట్టవలసి యుంటుందని సూచిస్తోంది. ప్రభుత్వం ఆహార ధాన్యాలను బాగా నిలవచేసి, ధరల్ని పెరగనీయకుండా అదుపులో పెట్ట వలసియుంటుందని చెబుతోంది.

## ఎగుమతి దిగుమతుల్లో లోటు

వచ్చే ఐదు సంవత్సరాల్లో యంత్రపనిముట్లు ఎక్కువగా దిగుమతి చేసుకోవలసి యుంటుంది. ఎగుమతులు పెద్దగా పెరుగుతాయని ప్రభుత్వం అంచనా వేయడంలేదు. కనుక ఏటా విదేశ వ్యాపారంలో రు. 224 కోట్లు చొప్పున రు. 1120 కోట్లు లోటు వస్తుంది. ఇందులోకూడా ఒక ప్రమాదం వున్నది. దిగుమతయ్యే విదేశీ సరకుధరలు నూరింట పదిపాళ్లు పెరిగితేగాని, మనం ఎగుమతి చేసే వస్తువుల ధరలు విదేశాల్లో పదిపాళ్లు తరిగితేగాని మనలోటు ఏటా రు. 80 కోట్లు పెరుగుతుంది. ఎగుమతుల ద్వారా మనకువచ్చే డబ్బులో సగానికిపైగా నూలువస్త్రాలు, జనపనార సంచులు, తేయాకు ఎగుమతిద్వారా వస్తోంది. ఐతే తీవ్రమైన పోటీని తట్టుకోవలసివస్తోంది. తేయాకు, నూలువస్త్రాల ఎగుమతులు 1954 లో కంటె 1955 లో తగ్గాయి. ఇటువంటి చిక్కులూ వుంటాయి. ఏమైనా రు. 1120 కోట్ల లోటులో రు. 200 కోట్లు స్టెర్లింగు నిల్వలనుండి సర్దుతారు. వందకోట్లు విదేశీ ప్రయివేట్ పెట్టుబడి వస్తుందని ఆశిస్తున్నారు. రు. 800 కోట్లు విదేశ రాజ్యాల నుండి అప్పుగాని, సహాయంగాని రావాలి. ఆ విధంగా లోటు భర్తీకావచ్చు.

# రెండవ పంచవర్ష ప్రణాళికలో ఉత్పత్తి లక్ష్యాలు

| ఉత్పత్తి రంగము, అంశము | ప్రమాణము | 1950–51 | '55–56 | '60–61 | '55–56 లో కంటె '60–61 లో 100 కి పెరుగుదల |
|---|---|---|---|---|---|
| **1. వ్యవసాయం** | | | | | |
| ఆహారధాన్యాలు | (కోట్ల టన్నులు) | 5.40 | 6.50 | 7.50 | 15 |
| పత్తి | (లక్షల బేళ్లు) | 29 | 42 | 55 | 31 |
| చెరకు, బెల్లం | (లక్షల టన్నులు) | 56 | 58 | 71 | 22 |
| నూనెగింజలు | (లక్షల టన్నులు) | 51 | 55 | 70 | 27 |
| జూట్ | (లక్షల బేళ్లు) | 33 | 40 | 50 | 25 |
| తేయాకు | (కోట్ల పౌన్లు) | 61.30 | 64.40 | 70.00 | 9 |
| జాతీయ విస్తరణ కేంద్రాలు | (సంఖ్య) | — | 500 | 3800 | 660 |
| కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులు | (సంఖ్య) | — | 622 | 1120 | 80 |
| పై రెండింటివల్ల ప్రయోజనం పొందిన ప్రజల సంఖ్య | (కోట్లు) | — | 8 | 32.50 | 306 |
| గ్రామ పంచాయితీలు | (వేలల్లో) | 83 | 118 | 200 | 70 |
| **2. ఇరిగేషను, విద్యుచ్ఛక్తి** | | | | | |
| సాగైన ప్రాంతం | (కోట్ల యకరాలు) | 5.10 | 6.70 | 8.80 | 31 |
| విద్యుచ్ఛక్తియొక్క ఉత్పత్తి సామర్థ్యం | (లక్షల కిలోవాట్లు) | 23 | 34 | 69 | 103 |
| **3. ఖనిజాలు** | | | | | |
| ముడి ఇనుము | (లక్షల టన్నులు) | 30 | 43 | 125 | 191 |
| బొగ్గు | (కోట్ల టన్నులు) | 3.23 | 3.80 | 6.00 | 5 |
| **4. పెద్దపరిశ్రమలు** | | | | | |
| ఉక్కు | (లక్షల టన్నులు) | 11 | 13 | 43 | 231 |
| దుక్క ఇనుము | (వేల టన్నులు) | — | 38 | 75 | 97 |
| అల్యూమినియం | ,, | 3.7 | 7.5 | 25.0 | 233 |
| ఉక్కు ఫోర్జింగులు | ,, | — | — | 12 | — |
| పోత ఉక్కు | ,, | — | — | 15 | — |
| ఉక్కు ఫాబ్రికేషన్లు | ,, | — | 180 | 500 | 178 |
| యంత్రపరికరాలు | (లక్షల రూపాయల్లో విలువ) | 31.8 | 75 | 300 | 300 |

| ఉత్పత్తి రంగము, అంశము | ప్రమాణము | 1950–51 | '55–56 | '60–61 | '55–56 లో కంటె '60–61 లో 100 కి పెరుగుదల |
|---|---|---|---|---|---|
| సిమెంటు యంత్రాలు | ,, | — | 56 | 200 | 257 |
| పంచదారమిల్లు యంత్రాలు | ,, | — | 28 | 250 | 779 |
| బట్టలమిల్లు యంత్రాలు జూట్ మిల్లు యంత్రాలు | ,, | — | 412 | 1950 | 373 |
| కాగితంమిల్లు యంత్రాలు | ,, | కొద్ది | కొద్ది | 400 | — |
| పవర్ పంపులు | (వేల సంఖ్యలో) | 34 | 40 | 86 | 115 |
| డీసెల్ యింజన్లు | (వేల హార్స్‌పవర్) | — | 100 | 205 | 105 |
| మోటారుకార్లు | (సంఖ్య) | 16,500 | 25,000 | 57,000 | 128 |
| రైల్వే యింజన్లు | ,, | 3 | 175 | 400 | 129 |
| ట్రాక్టర్లు | ,, | — | — | 3000 | — |
| సిమెంటు | (లక్షలటన్నులు) | 27 | 43 | 130 | 202 |
| అమోనియం సల్ఫేట్ ఎరువులు | (వేలటన్నులు) | 46 | 380 | 1450 | 282 |
| సూపర్ ఫాస్ఫేట్ ఎరువులు | ,, | 55 | 120 | 720 | 500 |
| గంధకపుద్రావకం | ,, | 99 | 170 | 470 | 176 |
| సోడాయాష్ | ,, | 45 | 80 | 230 | 188 |
| కాస్టిక్ సోడా | ,, | — | 36 | 150 | 317 |
| పెట్రోలుశుద్ధి | (లక్షలటన్నులు) | — | 36 | 43 | 19 |
| ఎలక్ట్రిక్ ట్రాన్స్‌ఫార్మర్లు | (వేల కె. వి. ఏ.) | 179 | 540 | 1360 | 151 |
| విద్యుచ్ఛక్తి తీగలు | (టన్నులు) | 1420 | 9000 | 18000 | 100 |
| ఎలక్ట్రిక్ మోటార్లు | (వేల హార్స్ పవర్) | 99 | 240 | 600 | 150 |
| నూలుబట్టలు | (కోట్లగజాలు) | 461.8 | 685.0 | 850.0 | 24 |
| పంచదార | (లక్షల టన్నులు) | 11 | 17 | 23 | 35 |
| కాగితం, కాగితం అట్టలు | (వేలటన్నులు) | 114 | 200 | 350 | 75 |
| సైకిళ్లు | (వేలసంఖ్య) | 101 | 550 | 1000 | 82 |
| కుట్టుమిషన్లు | ,, | 33 | 110 | 220 | 100 |
| ఎలక్ట్రిక్ ఫాన్‌లు | ,, | 194 | 275 | 600 | 118 |

## 5. రవాణా, కమ్యూనికేషన్లు

రైల్వేలు :

| ఉత్పత్తి రంగము, అంశము | ప్రమాణము | 1950–51 | '55–56 | '60–61 | '55–56 లో కంటె '60–61 లో 100 కి పెరుగుదల |
|---|---|---|---|---|---|
| ప్యాసింజరు రైళ్ళప్రయాణం | (కోట్లమైళ్ళు) | 9.5 | 10.8 | 12.4 | 15 |
| గూడ్సురైళ్ళలో సరకులప్రమాణం | (కోట్లటన్నులు) | 9.1 | 12.0 | 16.2 | 35 |

| ఉత్పత్తి రంగము, అంశము | ప్రమాణము | 1950-51 | '55-56 | '60-61 | '55-56 లో కంటె '60-61 లో 100 కి పెరుగుదల |
|---|---|---|---|---|---|
| రోడ్లు : | | | | | |
| నేషనల్ హైవేసు | (వేలమైళ్ళు) | 12.3 | 12.9 | 13.8 | 7 |
| మామూలురోడ్లు | ,, | 97.0 | 107.0 | 125.0 | 17 |
| నౌకానిర్మాణం : | | | | | |
| తీరప్రయాణ నౌకలు | (లక్షల జి. ఆర్. టి.) | 2.2 | 3.2 | 4.3 | 34 |
| సముద్రప్రయాణనౌకలు | ,, | 1.7 | 2.8 | 4.7 | 68 |
| రేవులు : రవాణా చేయగల సరకుల ప్రమాణం | (కోట్లటన్నులు) | 2.0 | 2.5 | 3.25 | 30 |
| పోస్టాఫీసులు | (వేలసంఖ్యలో) | 36 | 55 | 75 | 36 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | ,, | 3.6 | 4.9 | 6.3 | 28 |
| టెలిఫోన్లు | ,, | 168 | 270 | 450 | 67 |
| **6. విద్య** | | | | | |
| మొత్తం బాలబాలికల్లో స్కూళ్లకువెళ్ళే వారిశాతం | | | | | |
| 6-11 మధ్యవయస్సు | | 42.0 | 51.0 | 63.0 | — |
| 11-14 ,, | | 14.0 | 19.0 | 22.5 | — |
| 14-17 ,, | | 6.4 | 9.4 | 12.0 | — |
| ప్రాథమిక పాఠశాలలు | (లక్షలలో) | 2.23 | 2.93 | 3.50 | 19 |
| ప్రాథమికోపాధ్యాయులు | ,, | 7.4 | 10.3 | 13.4 | 30 |
| ట్రెయినింగ్ స్కూళ్లు, కాలేజీలు | (సంఖ్య) | 835 | 1136 | 1412 | 24 |
| ట్రెయినింగ్ స్కూళ్లు కాలేజీలలో ఎన్‌రోలుమెంటు | (వేలసంఖ్యలో) | 75.6 | 103.5 | 134.2 | 30 |
| **7. ప్రజారోగ్యం** | | | | | |
| ఆసుపత్రులు | (వేలసంఖ్యలో) | 8.6 | 10 | 12.6 | 26 |
| ఆసుపత్రి మంచాలు | ,, | 113 | 125 | 155 | 25 |
| డాక్టర్లు | ,, | 59 | 70 | 82.5 | 18 |
| నర్సులు | ,, | 17 | 22 | 31 | 41 |
| మంత్రసానులు | ,, | 18 | 26 | 32 | 23 |
| దాయీలు | ,, | 4 | 6 | 41 | 583 |
| శానిటరీ ఇన్‌స్పెక్టర్లు వగైరా | ,, | 3.5 | 4 | 7 | 75 |

# 2

## జాతీయావసరాలు : అవకాశాలు

ప్రణాళికా సంఘమూ, కేంద్ర ప్రభుత్వమూ ప్రజలముందుంచుతున్న భవిష్యదభివృద్ధిని జాతీయావసరాలతోను అవకాశాలతోను పోల్చిచూడ్డం అవసరం. అప్పుడే, ప్రభుత్వ పథకాలు అవకాశాల్ని ఉపయోగించుకొని అవసరాల్ని కనిపెట్టి త్వరగా దేశాన్ని ముందుకు తీసుకుపోతున్నాయో, కుంటినడకను మాత్రమే నడుస్తున్నాయో అర్థం చేసుకోగలం.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మనదేశాన్ని వ్యావసాయిక దేశంగానే వుంచి దోచుకుంటూ వచ్చారు. స్వరాజ్యమేర్పడి 9 సంవత్సరాలు పూర్తయినా, మనదేశ ఆర్థికపునాదులలో ప్రధానమైన మార్పు ఏమీ జరగలేదు. ఈ విషయాన్ని దిగువ మాటల్లో ప్రణాళికా సంఘమే విదితం చేసింది: "పారిశ్రామికోత్పత్తి గణనీయంగా పెరిగినా, గత మూడు నాలుగు దశాబ్దాలుగా దేశ జీవన పద్ధతిలో గణనీయమైన మార్పేమీ జరగలేదు". నూటికి 70 మంది కష్టపడి పనిచేసేవారు వ్యవసాయంమీదగాని, దానిపై ఆధారపడిన వృత్తులలోగాని జీవిస్తున్నారు. 2.6 శాతం మాత్రమే గనుల్లోనూ మిల్లుల్లోనూ పనిచేస్తున్నారు. చిన్న వ్యాపారాల్లోనూ భవన నిర్మాణ కార్యక్రమాల్లోనూ 8 శాతం పనిచేస్తున్నారు. రవాణా పైనా, వ్యాపారంపైనా ఆధారపడిన వృత్తులవారు నూటికి 7 గురు. ఉద్యోగాలు, కళలు, గృహ కృత్యాలు మొదలైన వృత్తులపై 10 మంది ఆధారపడియున్నారు. పారిశ్రామికాభివృద్ధి లోపించడం

వల్ల యితర వృత్తులు అభివృద్ధికాలేదు. ఎంతో ఎక్కువ మందిని పనుల్లో యిముడ్చుకోగలిగినశక్తి గృహపరిశ్రమలకు లేదు. ఇప్పుడు వ్యవసాయ వృత్తుల్లో వున్నవారిలో దాదాపు 3 వ వంతు వరకూ ఆ వృత్తిలో అనవసరమే. ఏ యితర ఆధారమూ కనపడక దాని పైనే ఆధారపడియున్నారు. ప్రణాళికాసంఘం అనుసరించే పద్ధతినీ వేసే భవిష్యత్తు అంచనానూ బట్టి 20 సంవత్సరాల నాటికి కూడా యీ పరిస్థితిలో పెద్ద మార్పేమీ వుండదని బోధపడుతోంది. 1976 నాటికి వ్యవసాయ వృత్తుల్లోనివారి సంఖ్య నూటికి 70 నుండి 60 కి మాత్రమే తగ్గుతుందని అంచనా వేస్తున్నది.

## జీవనస్థాయి

ఈ పరిస్థితిలో ప్రధానమైన మార్పు జరగకుండా ప్రజల జీవనస్థాయి పెరగడం కష్టం. భారతదేశంలో ప్రజల జీవనస్థాయి ప్రపంచంలోకల్లా తక్కువగా వున్నదని ప్రణాళికాసంఘం చెబుతున్నది. అయినా తాను సూచించిన ప్రణాళికలక్ష్యాలు పెద్ద ఆశాజనకంగా లేవు. సగటు ఆహారవాడకం మనిషి 1కి రోజుకి 17.2ఔన్సులున్నది. ఇది 1960-'61 నాటికి 18.3 ఔన్సులవరకూ పెరుగుతుందని అంచనావేశారు. మానవునికి కనీసం 3 వేల క్యాలరీల ఆహారం అవసరమైయుండగా, అయిదేళ్ళ తర్వాత సహితం వయోజనుల సగటు వాడకం 2,450 క్యాలరీల ఆహారంమాత్రమే కాగలదు. కనీసం ప్రతిమనిషీ రోజుకు 15 ఔన్సుల పాలు పుచ్చుకోవడం అవసరమని ఆహార నిపుణులసలహా. కాని మన దేశంలో యిప్పుడు సగటు లెక్కచూస్తే మనిషికి 5 ఔన్సుల చొప్పున మాత్రమే పాలవాడకం వున్నది. అయిదేళ్ళ తర్వాత మరొక అర ఔన్సు యిందుకు తోడవుతుందని అంచనా. రోజుకి మనిషికి 1.4 ఔన్సుల చొప్పున పంచదార యిప్పుడు ఖర్చవుతుండగా, రెండవ ప్రణాళికానంతరం అది 1.7 ఔన్సు లవుతుంది. సంవత్సరానికి సగటున మనిషికి 4 గుడ్లు యిప్పుడు వాడబడుతున్నాయనీ,

అయిదేళ్ళ తర్వాత అనుకున్న లక్ష్యం పూర్తయితే యీ వాడకం 20గుడ్లవరకూ పెరగవచ్చుననీ వింటే,ఆహారపుష్టి ఏస్థితిలోనున్నదో అర్థంచేసుకోవచ్చు. కనీస ఆహార అవసరాలు గడవనందునే ఆరోగ్యపరిస్థితి అధ్వాన్నంగా వున్నదని ఆరోగ్యశాస్త్రవేత్తలు చెబుతున్నారు.

దేశంలో యితర అవసరాల పరిస్థితిని చూచినా అధ్వాన్నంగానే వుంది. బట్ట సగటువాడకం నేటికీ యుద్ధకాలపు 16 గజాల చుట్టూ తిరుగుతూనేవున్నది. 1961 కి యీ వాడకం 18 గజాలు కావచ్చని అంచనా. దేశంలోగల 5,61,107 పట్టణాలకూ, పల్లెలకూగాను 18 వేలకు మాత్రమే 1960-61 నాటికి విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది. 74,900 కు మాత్రమే పోస్టాఫీసు లుంటాయి. 5,56,565 గ్రామాలకుగాను 2,45,000 పంచాయితీలు మాత్రమే ఏర్పడతాయి. 5 వేలమందికి ఒక డాక్టరు, 13 వేలమందికి ఒక నర్సు, 6500 మంది స్త్రీలకొక మంత్రసాని వుంటారు. 1960-61 నాటికి ఉచితంగా ప్రాథమిక విద్య ప్రతి బాలబాలికకు అందించాలని రాజ్యాంగచట్టం ఆదేశించింది. కాని, ఆనాటికి ప్రతి వందమంది పిల్లలకూ 37 గురు ఏ బడిముఖమూ చూడనివారుగానే మిగిలిపోతారు.

రైల్వే ప్రయాణంలో ఇప్పుడున్న రద్దీ, 1960 నాటికి దాదాపు అలాగే వుంటుంది.

బస్తీల్లోనూ పల్లెపట్టునా ఇండ్ల కొరత దుర్భరంగా వున్నది. ఉన్న ఇళ్ళలో సహితం పల్లెటూళ్ళలో నూరింట 34 యిళ్ళూ, బస్తీలలో 44 ఇళ్ళూ కేవలం ఒక గది గలవి మాత్రమే. 1961 నాటికి బస్తీలలోనే 50 లక్షల కుటుంబాలు ఇల్లూ వాకిలీ లేక అల్లాడుతూంటాయని అంచనాలు విదితం చేస్తున్నాయి.

ప్రజల అప్పు రు. 900 కోట్లుగావున్నది. ఈ అప్పుభారాన్ని తగ్గించే సదుపాయంగా ఋణ నివారణచట్టాలు యింకనూ ప్రవేశ

పెట్టవలసే యున్నది. ప్రభుత్వంగాని, పరపతి సంఘాలుగాని ఇచ్చే అప్పు నూరింట 6 పాళ్ళు మాత్రమే వుండగా, మిగతా 94 పాళ్ళ అప్పుకు ప్రజలు కర్కోటక వడ్డీ వ్యాపారుల దోపిడీపై ఆధారపడవలసి వస్తోంది. సాలీనా ప్రజలకు రు. 750 కోట్ల అప్పు సమపాయం అవసరమై యుండగా, రానున్న అయిదేళ్ళకూ ప్రణాళిక 225 కోట్ల రూపాయలు మాత్రమే కేటాయించింది. సముద్రం లోకి ప్రవహించి పోతున్న నదీజలాలతో మనభూముల్ని సస్య శ్యామలం చేయగలందులకు యిప్పటికీ మనం వాడుకుంటున్నది 10 వ వంతు మాత్రమే.

## ఎంతవరకు పారిశ్రామికాభివృద్ధి ?

జాతీయ పునర్నిర్మాణానికి అత్యంతకీలకమైనది పారిశ్రామి కాభివృద్ధి. దానికి పునాది వేయగలిగినవి భారీపరిశ్రమలు. ఈ అవ సరాన్ని ప్రభుత్వమూ, ప్రణాళికాసంఘమూ గుర్తించి, మొదటి ప్రణాళిక సందర్భంలో తీసుకున్న వైఖరిని మార్చుకోవడం సంతోష దాయకమే.

రెండవ ప్రణాళికలో ప్రధానంగా దాదాపు రు. 350 కోట్లు ఖర్చుపెట్టి భిలాయ్, రూర్కేలా, దుర్గాపూర్‌లలో ఒక్కొక్కటి 10 లక్షల టన్నులు ఉత్పత్తిచేయగల ఉక్కు కర్మాగారాలను నిర్మించ పూనుకోవడం, భారీ ఎలక్ట్రికల్ పనిముట్లను, ఇంజనీరింగు పనిముట్లను తయారుచేయడం మన పారిశ్రామికాభివృద్ధికి ఎంతో తోడ్పడుతుంది. సగటున మన రైళ్ళకు ఏటా 450 యింజన్లు, 21500 దాకా వ్యాగన్లు, 2300 వరకూ రైలుపెట్టెలు కావలసి యుండగా, 1960-61 నాటికి మనదేశంలో 400 యింజన్లు, 2500 వ్యాగన్లు, 1800 పెట్టెలు తయారుచేయగలిగిన పరిశ్రమలు ఏర్పడ్డం చాలా ఉపయోగకరం. అయితే, "వెనుకబడిన దశనుండి దేశం బయటపడాలంటే త్వరత్వరగా అభివృద్ధిని సాధించడం అవసర"మని కూడా ముసాయిదా ప్రణాళిక చెబుతోంది. కాని, మొత్తంగా

మాస్తే ప్రణాళిక సాధించనున్న పారిశ్రామికాభివృద్ధి ఆ అవసరానికీ ఆతురతకూ తగినట్లు లేదు.

1960-61 నాటికీ నేటికీ మన ఆర్థిక పునాదిలో జరిగే మార్పు స్వల్పం. జాతీయాదాయంలో యిప్పుడు 48 పాళ్ళు వ్యవసాయం నుండీ, 9 పాళ్ళు పరిశ్రమల నుండీ వస్తూండగా, 1961 నాటికి ఆ దామాషా 46:11 పాళ్ళుగామాత్రమే మారుతుంది. ఇప్పుడేర్పడుతున్న భారీపరిశ్రమలు వెంటనే అంత ఆదాయాన్ని పెంచనిమాట, భవిష్యత్తుకు ఉపయోగించేమాట వాస్తవమే. అయినా ప్రణాళికా సంఘం అంచనానుబట్టి ఇక ఇరవై యేళ్ళకు కూడా నూరింట 60 మంది వ్యవసాయంమీదనే బ్రతకవలసి యుంటుందిగదా! ఎంత జరిగినా, అందుకు పరిమితమయ్యే పారిశ్రామికాభివృద్ధి వుంటుందిగదా!

మన దేశ ఎగుమతి దిగుమతుల నిమిత్తం చెల్లించే ఓడ కిరాయిను. 80 కోట్లలో 70 కోట్లు విదేశ ఓడ వ్యాపారులకే పోతోంది. అయిదేళ్ళ తర్వాత కూడా ఆ పరిస్థితిలో పెద్దగా మార్పు సంభవించదు. కోస్తా వ్యాపార సరుకులో సగమూ, విదేశ వ్యాపార సరుకులో 15 శాతమూ మాత్రమే మన ఓడలు చేరవేయ కలుగుతాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చితే, మనం ఏ స్థితిలో వున్నామో అర్థంచేసుకునేందుకు ప్రణాళికా సంఘం విద్యుచ్ఛక్తి, ఉక్కు వాడకములను గురించి కొన్ని ఉదాహరణలు యిచ్చింది. జపానులో ఒక్కొక్కరూ సగటున వాడే విద్యుచ్ఛక్తిలో మనం 9వ వంతు వాడుతున్నాం. అమెరికా సగటు వాడకంలో మన వాడకం 73 వ వంతున్నది. జపానులో మనిషికి సగటున వాడే ఉక్కులో మనం సగటున వాడేది 14 వ వంతుగానూ అమెరికాలో వాడేదానిలో 122 వ వంతుగానూ ఉన్నది.

### ప్రజలపై బరువుమోపని వనర్లు లేవా?

వనరుల విషయం వచ్చేసరికి ప్రణాళికాసంఘం సూచనలు చాలా బలహీనంగావున్నాయి. ప్రభుత్వం అనుసరించే పద్ధతులు

భరించలేని ప్రజలపైనే మరింత భారాన్ని నెట్టేవిగావున్నాయి. ఆదాయపు వనరులు లేకకాదు, యీ పద్ధతి అనుసరిస్తోంది. ఎవరైతే మన ఆర్థికవిధానానికి ఆటంకాలుగావున్నారో, అటువంటి సామ్రాజ్యవాదులతోనూ, భూస్వాములతోనూ రాజీపడుతూ, వారికి పెద్ద మొత్తాలుగా నష్టపరిహారాన్ని కట్టపెట్టే విధానం అనుసరించడంవలన, గుత్త వ్యాపారులకు లొంగుబాటు తత్వం చూపడంవలన యీ స్థితి ఏర్పడుతోంది.

ప్రభుత్వ రంగంలో పరిశ్రమలు ఎంత ఎక్కువగావుంటే అంత ఎక్కువగా ప్లానులు వేయడానికీ, పరిస్థితిని అదుపులో పెట్టడానికీ, మార్పులు తేవడానికీ వీలుంటుంది. మన దేశంలో తరతరాలుగా దోచుకుంటూన్న బ్రిటిషు కోటీశ్వరులు పెద్ద పెట్టుబడులను కూడగట్టారు. తేయాకుతోటల్లో, బొగ్గుగనుల్లో, జూట్ పరిశ్రమలో, యింకెన్నో వ్యాపారాల్లో యీ పెట్టుబడులద్వారా దోపిడీ సాగిస్తున్నారు. ఏటా రు. 150 కోట్లకు తగ్గని లాభాలను ఏదో ఒక రూపంలో తరలించుకుపోతున్నారు. ఈ పెట్టుబడులను జాతీయం చేయడంద్వారా ప్రభుత్వం చేతుల్లో ఆర్థిక కీలకాలన్నీ వుంటాయి. వాళ్ళు తరలించుకుపోయే లాభాల నుపయోగించుకుంటే, ఏటా ఒక నాగార్జునసాగర్ ప్రాజెక్టునో, ఒక భిలాయి ఉక్కు కర్మాగారాన్నో కట్టవచ్చు.

అంతర్జాతీయ పరిస్థితులు యిందుకు అనుకూలంగా వున్నాయి కూడా. సామ్రాజ్యవాదులు వెనుకటిరోజుల్లో ఆసియా ఆఫ్రికాలలో దురాగతంగా ఏర్పరచుకొన్న పెత్తనాలనూ పెట్టుబడులనూ ఊడగొడుతూంటే, వాళ్ళెంత గగ్గోలు పెట్టినా నైతిక సానుభూతి ప్రపంచంలో ఎక్కడా కానరావడంలేదు. సూయజ్ కాలవ విషయంలో ఈజిప్టు ప్రభుత్వమూ, హాలెండుకు యివ్వవలసిన అప్పు విషయంలో ఇండొనేషియా ప్రభుత్వమూ ఈ అవకాశాల్ని ఉపయోగించుకున్నాయి. మన జాతీయ పునర్నిర్మాణం కొరకు ప్రభుత్వం ఎందుకు యీ పని చేయరాదో

అర్థం కాదు. ఆపని చేయకపోగా, కనీసం విదేశీ కోటీశ్వరులు తరలించుకు పోయే లాభాలకైనా పరిమితిపెట్టి మిగిలిన దానిని ప్రణాళికా కార్యక్రమాలకు పెట్టుబడిగా పెట్టమని కోరితే, ససేమిరా వీలుకాదంటున్నది. మన దేశ ప్రతిష్టకు అది భంగకరం అని ప్రధానమంత్రి సమాధానం చెబుతున్నాడు. జాతీయంచేసిన ఇంపీరియల్ బ్యాంకు, జీవిత భీమాకంపెనీలకు అందరితోపాటు బ్రిటిష్ భాగస్తులకూ కావలసినంత నష్టపరిహారం ముట్టింది.

మన విదేశ వ్యాపారమంతా ప్రయివేట్ వ్యాపారుల చేతుల్లోనూ, ముఖ్యంగా ఇంగ్లీషు కంపెనీలయిన ర్యాలీ అండ్ కో., ఐ. యల్. టి. డి., లివర్ బ్రదర్సు మొదలైన కంపెనీల చేతుల్లోనూ సాగుతోంది. మన ఎగుమతి దిగుమతుల ధరలను యీ కంపెనీలు తమ లాభాపేక్షనుబట్టి మార్చుతూ, దేశాన్ని రైతాంగాన్ని నష్టాల పాలుజేస్తున్నారు. విదేశ వ్యాపారాన్ని ప్రభుత్వ యాజమాన్యంలోకి తీసుకుంటే యీ నష్టం పోతుంది. ప్రభుత్వానికి వచ్చిన లాభాన్ని ప్రణాళికకు పెట్టుబడిగా వినియోగించవచ్చు. కాని, ఆ పనిచేయ నిరాకరిస్తోంది ప్రభుత్వం.

సామ్రాజ్యవాదులు మనకు అవసరమైన భారీయంత్రాలను అమ్మ నిరాకరిస్తారని భయపడవలసిన అగత్యం యిప్పుడు లేదు. ప్రక్కనే గొప్ప సోషలిస్టు ప్రపంచం పోటీగా ఏర్పడ్డది. సోవియట్ రష్యా భాగాలకోరిక, లాభాపేక్ష, రాజకీయబంధనాలూ లేకుండా భారీయంత్రాలను సహితం తక్కువ వడ్డీతో యిచ్చి, వెనకబడిన దేశాలకు తోడ్పడటానికి సిద్ధంగావున్నది. సామ్రాజ్య దేశాలు తమ అవసరాలకోరకే భారీయంత్రాలను అమ్ముకోక తప్పనిస్థితి ఏర్పడుతోంది. భారత ప్రభుత్వం గతంలోవలె గాక సోషలిస్టు రాజ్యాలతో సన్నిహిత సంబంధం కలిగించుకుంటూ భిలాయ్ ఉక్కు కర్మాగారాన్ని రష్యానుంచి పుచ్చుకోవడం, బొగ్గు, నూనె గనుల నుపయోగించడంలో రష్యన్ నిపుణుల సలహాపొందడం హర్షనీయమే. అయినా, నేటికీ భారత ప్రభుత్వం వ్యాపారానికీ, యంత్రసామగ్రికీ,

అప్పుడూ పాశ్చాత్య సామ్రాజ్యవాదులమీదనే ప్రధానంగా ఆధారపడుతోంది. రెండవ ప్రణాళిక కార్యక్రమానికి అవసరమైన రు. 800 కోట్ల విదేశ సహాయాన్ని ప్రధానంగా అమెరికా, ఇంగ్లండుల నుండి పొందాలని ఆశిస్తోంది. ఇదివరకున్న విదేశీ ప్రయివేట్ వ్యాపారుల దోపిడీ చాలక మరొక 100 కోట్ల రూపాయల ప్రయివేట్ పెట్టుబడిని పాశ్చాత్య పెట్టుబడిదారుల నుండి ఆశిస్తోంది. రష్యా రెండున్నర రూపాయల వడ్డీతో భిలాయ్ ఉక్కు కర్మాగారానికి పెట్టుబడి పెడుతున్నదని ప్రభుత్వం అంగీకరించింది. తర్వాత ఆరు రూపాయలు వడ్డీ చెల్లించేందుకూ, కొన్ని యితర షరతులను అంగీకరించేందుకూ సిద్ధమై ప్రభుత్వం ఇంగ్లండు ద్వారా దుర్గాపూర్ ఉక్కు కర్మాగారాన్ని కూడా నిర్మించ పూనుకున్నది. నేటికీ మన విదేశ వ్యాపారంలో ఎక్కువ భాగం ఇంగ్లండుతోనే జరుగుతూన్నది. ఇంగ్లండుతో ఎక్కువ వ్యాపారం చేస్తున్నందున మనకు లాభం కలగటంలేదు. ఇంగ్లీషు పెట్టుబడిదారుల వ్యాపారాలకు మన ప్రభుత్వం యింకా "సామ్రాజ్య రక్షణలు" (ఇంపీరియల్ ప్రిఫరెన్సులు) కలిగించడంతో నష్టమే వస్తున్నది. పైగా మన జాతీయ పరిశ్రమలకు వాళ్ళ పోటీనుండి రక్షణ కలగటంలేదు.

దేశంలో కోటీశ్వరులు విపరీతంగా పెంచుకుంటున్న లాభాలకు హద్దులు పెట్టమనీ, ఉన్నతోద్యోగుల జీతాలు తగ్గించమనీ, దానివలన మిగిలే డబ్బును పెట్టుబడిగా వినియోగించమనీ పదేపదే పార్లమెంటులో వచ్చిన సూచనలనూ, అధికారేతర తీర్మానాలనూ ప్రభుత్వం త్రోసిపుచ్చింది.

కొట్లల్లో చివికిపోతున్న కరెన్సీ నోట్లను ఎలుకలు కొట్టినా దిక్కులేనంత మూలధనంతో మూలుగుతున్న నైజాంవంటి నవాబులవద్ద, మహారాజులవద్ద మూలధనాలను స్వాధీనం చేసుకోమంటే, ప్రభుత్వం వీలులేదంటున్నది. పైగా వారికే ఏటా కోట్లకొలది భరణాలు ముట్టచెబుతోంది. జమిందారులనుండి శిస్తు వసూలుచేసే

హక్కును ప్రభుత్వం స్వాధీనంచేసుకున్నందుకు రు. 500 కోట్లవరకు నష్టపరిహారం యివ్వ నిశ్చయించుకున్నది. ఆ జమీందారులు సుఖ ప్రదంగా నివసించడానికి లోటులేదుగనుక, వారికి ఆ నష్టపరిహారం యివ్వకుండా వాయిదా వేయమని ప్రజలు కోరుతున్నారు. కాని, యిదివరకే యిచ్చింది పోను మిగతాదికూడా త్వరగా చెల్లించి వేయమని ముసాయిదా ప్రణాళిక చెబుతోంది.

భారతదేశంలో కోటీశ్వరులు ఏటా రు. 200 కోట్ల పన్నుల్ని అయినా ఎగవేస్తున్నారని బ్రిటిష్ ఆర్థికవేత్త కల్డార్ అంచనా వేశాడు. ఆ పన్ను ఎగవేతల్ని అరికట్టాలని ప్రభుత్వమూ చెబు తున్నది. కాని తీవ్రమైన చర్యల్నిమాత్రం తీసుకోవడంలేదు.

ఉన్న అవకాశాలను సద్వినియోగం చేసుకోనకపోతే, యింకెక్కడనుండి వస్తుంది డబ్బు? అప్పులమీద, ప్రజలపై అధికపన్నులు రుద్దడంమీద, అదనంగా కరెన్సీ నోట్లను అచ్చు వేయడం మీద ఆధారపడవలసి వస్తోంది.

## అంత అదనపు కరెన్సీయా?

ప్రణాళిక పెట్టుబడికి ఏర్పడిన లోటును భర్తీచేసేందుకు రు. 1200 కోట్లు కరెన్సీని అదనంగా అచ్చువేయదలచింది ప్రభుత్వం. గత ప్రణాళిక ద్వారా జాతీయాదాయం దాదాపు 5 వ వంతు పెరిగినట్లు ప్రభుత్వం లెక్కవేస్తోంది. ఆ దశలో 420 కోట్ల రూపా యల కరెన్సీని అదనంగా అచ్చువేసింది. రానున్న అయిదు సంవత్స రాల్లో నాల్గవవంతు జాతీయాదాయం పెరుగుతుందని అంచనా వేస్తున్నది. ఆదాయం పెంపుదలలో మొదటి ప్రణాళిక ఫలితానికీ రెండవ ప్రణాళిక ఫలితానికీ పర్సంటేజిలో పెద్ద వ్యత్యాసంలేదు. కాని అచ్చువేయనున్న కరెన్సీనోట్లలో మాత్రం దాదాపు మూడు రెట్లు తేడాకనబడుతోంది. ఇప్పటికే ఆదాయాన్ని మించిన కరెన్సీ అచ్చయి, ధరలు అధికమై ప్రజలు ఆందోళన చెందు తూండగా, ఇకముందెలా వుంటుందో ఊహించుకోవచ్చు.

ఇప్పటికి పెరిగిన అధిక ధరలనుచూచి పెట్టుబడిదారులు సంతో షిస్తున్నట్లు రిజర్వుబ్యాంకి రిపోర్టు చెబుతోంది. కరెన్సీని అధికం చేయడం అంటే ప్రజలపై మరొక రూపంలో పన్ను వేయడమేనని ముసాయిదా ప్రణాళికే చెబుతున్నది. అలాంటప్పుడు ఆదాయం ఏ మేరకు పెరిగితే ఆ మేరకే అదనపునోట్లు అచ్చువేయరాదా?

## పన్నుల భారమూ ప్రజలమీదేనా?

ముసాయిదా ప్రణాళికలో సూచించిన రు 850 కోట్ల పన్ను ప్రధానంగా ప్రజలపై పడేదేనని ఆచరణ రుజువుచేస్తోంది. రాను రాను బ్రిటిషు ప్రభుత్వం ఉన్ననాటికంటెకూడా ప్రభుత్వాదాయంలో భాగ్యవంతులపైబడే ప్రత్యక్షపన్నుల భాగం తగ్గి, ప్రజలపైబడే పరోక్షపన్నుల భాగం ఎక్కువవుతోంది. గత అయిదు యేళ్ళలోనూ యీ క్రమమే కానవస్తోంది. 1950 నాడు నూరింట 50 వంతులున్న పరోక్షపన్నులు 1956 కు 60 వంతు లయింది. ఆనాడు 50 వంతులున్న ప్రత్యక్షపన్నులు యీనాడు 40 వంతు లయింది. రెండవ ప్రణాళిక మొదటి సంవత్సరంలో వేసిన కేంద్ర ప్రభుత్వ పన్నులు రు. 35 కోట్లలో రు. 25 కోట్లు ప్రజల మీద, రు. 10 కోట్లు ధనవంతులమీద పడుతోంది. ఆంధ్ర ప్రభుత్వం వేస్తున్న పన్నులు చూచినా యిదే స్థితి. సూటిగా భూస్వాములమీదపడే వ్యవసాయాదాయాల పన్నును తప్పిస్తూ, రైతులందరిపైనా పడే యితరపన్నులవైపు రాష్ట్ర ప్రభుత్వం దూకుతోంది. ఆర్థికస్తోమతు లేని రైతులందరిమీదా పడేవిధంగా, ఏ మినహాయింపులు లేకుండా శిస్తు సర్ చార్జీ, అభివృద్ధిపన్ను, నీటి తీరువాలో పెరుగుదల మొదలైనవి పడుతున్నాయి. శిస్తు సర్ చార్జికి రాజగోపాలాచారి మంత్రివర్గం తలపెట్టిన రు. 50 ల లోపు మినహాయింపూ పోయింది. 1955 ఎన్నికలముందు ప్రచారం చేసిన రు. 10 ల లోపు శిస్తు రద్దు వాగ్దానమూ గాలికి పోయింది. రూపాయి శిస్తు కట్టేవాళ్ళదగ్గరనుంచీ యిప్పుడు సర్ చార్జి కట్టు

కోవలసిందే. భరించగలవారిపై భరించగలిగినంత పన్ను వేయాలే గాని మరొకవిధాన నడిస్తే ప్రజలెంతగా ఉత్సాహపడతారు ?

నోట్ల ముమ్మరంద్వారా ప్రజలనుండి పరోక్షంగా డబ్బు గుంజడం జరుగుతుంది. పన్నులూ ఎక్కువగా వాళ్ళమీదే పడతాయి. ఇంకా రు 1200 కోట్లు ప్రభుత్వానికి అప్పు పెట్టాలి. ఇవన్నీ అనుకున్న అంచనాప్రకారం జరుగుతాయాఅనే సందేహాలు ఆర్థికవేత్తల్లో ఎక్కువగావున్నాయి. ఇన్నీ జరిగితే ప్రజల్లో ఎంత కొనుగోలుశక్తి మిగులుతుంది ? పరిశ్రమల్లో అధికంగా వుత్పత్తి అయిన సరుకును ఎంతవరకు కొనగలుగుతారు ? అనే ప్రశ్నలు ఉదయిస్తున్నాయి.

## విదేశ వ్యాపారంలో లోటు

ఉత్పత్తి అంచనాలుగాని, ఎగుమతి విలువల అంచనాలుగాని అల్లే జరిగితీరుతా యనుకునేందుకు అవకాశాలు లేవు. మొదటిప్రణాళిక కాలంలో ఎక్కువ ఇరిగేషన్ సదుపాయాలు కలిగించడంవలన, ఎరువులు ఎక్కువగా సప్లయిచేయడంవలన, అనుకూల ఋతుపవనాలవలన ఆహార పంటలు ఎక్కువయ్యాయి. అందుమూలంగా విదేశాలనుండి వందల కోట్లకొలదీ ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకొనవలసిన దుస్థితి తగ్గింది. అయితే ఈ విషయంలోనూ ఉపేక్షించేందుకు వీలులేదు. గతసారి పార్లమెంటు సమావేశంలో మన దేశంనుండే ఆహారధాన్యాలను ఎగుమతిచేయగలస్థితి అభివృద్ధి అవుతోందని ప్రకటించారు. కాని యిప్పుడు జరుగుతున్న సమావేశంలో రు. 80కోట్ల ఆహారపదార్థాలను దిగుమతి చేసేందుకు అవకాశ మివ్వమని ప్రభుత్వం పార్లమెంటుముందు ప్రతిపాదించింది. వ్యవసాయోత్పత్తి గత అయిదేళ్ళలో 15 శాతం పెరగగా, వచ్చే అయిదేళ్ళలో 40 శాతం పెంచాలని ప్రభుత్వం ప్లాను వేస్తోంది. కాని 1954-55 కంటె '55-56 లో వ్యవసాయ పంటలు 3 శాతం తగ్గిపోయినట్లు ఇప్పుడు లెక్కలు వస్తున్నాయి. 1954లో 86కోట్ల 70 లక్షల గజాలబట్ట ఎగుమతి అయింది. 1960 నాటికి వందకోట్ల

గజాలబట్టను ఎగుమతిచేస్తూండాలని ప్రణాళికఅంచనా. కాని 1955లో బట్ట ఎగుమతి 74కోట్ల 70 లక్షల గజాలకు పడిపోయింది. 1956 మొదటి ఆరుమాసాల్లో 1955 మొదటి ఆరుమాసాలకంటెకూడా 2 కోట్ల 70లక్షల గజాల ఎగుమతి తగ్గినట్లు వార్తలు వస్తున్నాయి. వీటినిబట్టి విదేశ వ్యాపారంలో అనుకున్నదానికిమించి లోటు ఏర్పడవచ్చు.

## జాతీయాదాయం : పెట్టుబడిరేట్లు

సరైన వనర్లను నిర్ణయించుకొనకపోబట్టే జాతీయాదాయంలో ఎక్కువ భాగాన్ని పెట్టుబడిగా పెట్టేందుకుగాని, త్వరగా పురోగమనం సాధించేందుకుగాని ప్రణాళికాసంఘం మార్గం చూపలేకపోతున్నది. జాతీయాదాయంలో యిప్పుడు నూటికి 7 రూపాయలు పెట్టుబడిగా ఉపయోగిస్తున్నదనీ, వచ్చే ప్రణాళిక కాలంలో అది 11 రూపాయలుగా వుంటుందనీ 15-20 సంవత్సరాలకు కూడా 16-17 రూపాయలకు మించదనీ అంచనా వేస్తున్నది. చైనా తన జాతీయాదాయంలో మొదటి ప్రణాళికకు నూరింట 22 వంతులు పెట్టుబడిగా వినియోగిస్తున్నది. రష్యా తన పంచవర్ష ప్రణాళికలకు జాతీయాదాయంలో నూరింట 25 వంతులు పెట్టుబడిగా పెట్టింది.

జాతీయాదాయం రెండవ ప్రణాళిక కాలంలో సాలుకు 5 శాతం అభివృద్ధి చెందుతుందనీ, 20 సంవత్సరాలకు దాదాపు రెట్టింపు అవుతుందనీ ప్రణాళికా సంఘం అంచనా వేస్తున్నది. తాము అభివృద్ధి చెందుతున్న రోజుల్లో పాశ్చాత్యదేశాలు దాదాపు ఇదే రేటున జాతీయాదాయాన్ని ఎక్కువ చేసుకున్న మాట వాస్తవం. జపాను 1914 నుండి 1937 వరకూ యిదే రేటున అభివృద్ధి చెందింది. కాని ప్రతిదేశమూ పరాయి సామ్రాజ్యవాదుల పోటీకి, దెబ్బకు తట్టుకుంటూ ఎవరంతట వాళ్లు తంటాలు పడవలసిన ఆ కాలానికీ యీ కాలానికీ సాపత్యంలేదు. సోషలిస్టు విధానం ప్రపంచంలో ఒక పెద్దశక్తిగా పరిణమించినూతనపద్ధతులను నూతన అవకాశాలను కలిగించిన యీ దశలో, యిప్పటికే ఆ

స్యంగా మేలుకుంటున్న మనం కుంటుకుంటూనే నడవవలసిన అవసరం బొత్తిగా లేదు. రెండవ యుద్ధానంతరం కొత్తపంథా తొక్కిన జెకోస్లావేకియా, హంగరీలు ఏటా 12 శాతం తమ ఆదాయాన్ని పెంచుకున్నాయి. పోలెండు 14 న్నర శాతం, బల్గేరియా 16 శాతం పెంచుకున్నాయి. 1928-37 మధ్య కాలంలో సోవియట్ యూనియన్ సాలీనా 16 శాతం ఆదాయాన్ని పెంచుకున్నది. యుద్ధానంతర కాలంలోకూడా 15 శాతం చొప్పున పెంచుకున్నది. 6 లేక 8 సంవత్సరాల్లోనే ఆ దేశాలు తమ జాతీయాదాయాన్ని రెట్టింపు చేసుకున్నాయి.

## సత్వరాభివృద్ధికి హింస అవసరమా?

అయితే ఆ అభివృద్ధి హింసాత్మకం అయినందున త్వరగా కొనసాగిందనీ, మన దేశం ప్రజాస్వామిక పద్ధతిలో సాఫీగా సోషలిస్టు సమాజంవైపు పురోగమిస్తుందనీ కాంగ్రెసునాయకులు చెబుతున్నారు. కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీ రెండూ సోషలిస్టుసమాజ నిర్మాణాన్ని కాంక్షించేవే. ఆదాయాల్లో వ్యత్యాసాలు తగ్గాలనుకునేవే. ఈ ఆశయాలకు నిలబడుతున్నవే సోషలిస్టు, ప్రజా సోషలిస్టు పార్టీలు. ఈ పార్టీలన్నీ చిత్తశుద్ధితో తాము చెప్పే ఆశయాలను నమ్మి అమలుపరచపూనుకుంటే, పార్లమెంటులోగాని, ఏ శాసనసభలోగాని పునాదుల్ని మార్చగల సంస్కరణలు దాదాపు ఏకగ్రీవంగానే ఆమోదించబడతాయి. దేశంలో అత్యధిక సంఖ్యాక ప్రజానీకంయొక్క ఆమోదాన్ని పొందటంకూడా ఖాయమే. బ్రిటిష్ సామ్రాజ్యవాదులుగాని, జమీందారులుగాని, మహారాజులుగాని, మరెవ్వరుగాని యీ ఐక్యశక్తిని ఎదుర్కొని యుద్ధం చేయగలగటం దురూహ్యం. ప్రాథమిక మార్పులు చేసుకునేందుకుగాని, త్వరగా పురోగమనాన్ని సాధించేందుకుగాని హింస ఎక్కడ వస్తుందో అర్థంకాదు. స్వార్థమే పరమార్థంగాగల కొద్దిమంది కోటీశ్వరులను, భూస్వాములను నష్టపరచడమే హింస అయితే, వారి లాభాలకోసం దీర్ఘకాలం నడుం వాయకట్టుకొని

పనిచేస్తూ, పస్తులుంటూ, ప్రాణా లర్పిస్తూన్న కోటానుకోట్ల ప్రజలకు జరిగేది హింసో అహింసో తెలుసుకోవాలి. న్యాయమైన కూలికోసమో, చేసుకునేందుకు భూమికోసమో పెనగులాడే ప్రజలపై జైలు సంకెళ్ళు తగిలించడం, పోలీసు లాఠీలతో మోదు తూండడం సాఫీగా హృదయ పరివర్తన చేసే మార్గమేమో తెలియదు.

## సోషలిజమా - పెట్టుబడిదారీ విధానమా?

సోషలిస్టు సమాజ నిర్మాణమూ, ఆదాయాల్లోని వ్యత్యాసాలను తగ్గించడమూ తమధ్యేయం అని ప్రభుత్వం, ప్రణాళికాసంఘం ప్రకటించడం హర్షించవలసిన, పూర్తిగా బలపరచవలసిన విషయాలే. అయితే కబుర్లు ప్రజలకూ, కానుకలు కలవాళ్ళకూ యిస్తూ యిదే సోషలిజం అని నమ్మింపజూస్తే ప్రయోజనం శూన్యం.

"సోషలిస్టుతరహా సమాజాన్ని సాధించేందుకు మొదటి ప్రణాళిక పునాది వేసింది" అని ముసాయిదా ప్రణాళిక ప్రకటిస్తోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో భారీపరిశ్రమలైన ఇనుము, ఉక్కు కర్మాగారాలకుగాని, భారీఎలక్ట్రికల్ సామానులకుగాని శంకుస్థాపనైనా జరగలేదు. పరిశ్రమల్లో ప్రభుత్వం ఖర్చు పెడదామనుకున్న రు. 101 కోట్లకి ఖర్చుపెట్టింది రు. 57 కోట్లే స్వతంత్ర ఆర్థిక విధానానికి అవసరమైన కనీస పునాదుల్నికూడా వేయకుండా, సోషలిస్టుతరహా సమాజ నిర్మాణానికి పునాదులు పడ్డాయని చెప్పడం హాస్యాస్పదం. మొదటి ప్రణాళిక ఫలితాలుగాని, రెండవ ప్రణాళిక సందర్భంలో ప్రభుత్వం అనుసరించే పద్ధతులుగాని యీ ఉద్ఘాటనకు అనుకూలంగా లేవు. తద్విరుద్ధంగా వున్నాయి. పెట్టుబడిదారీ విధానాన్ని బలపరుచుకోవాలనే తాపత్రయమే ఆచరణలో కనపడుతోంది.

గత ప్రణాళికకాలంలో అనుకున్న లక్ష్యాలలో కొన్ని మాత్రమే నెరవేరినాయి. కష్టజీవులు శ్రమపడి పనిచేయబట్టే 22పాళ్లు పరిశ్రమల్లోనూ, 15 పాళ్లు వ్యవసాయంలోనూ అధికోత్పత్తి

జరిగి, 18పాళ్ళు జాతీయాదాయం పెరిగింది. పెరిగిన ఆదాయంలో ఎక్కువ భాగాన్ని కలవారికే కట్టపెట్టింది ప్రభుత్వం. 1939నాటితో పోల్చితే గుత్తవ్యాపారుల లాభాలు విపరీతంగా పెరిగాయి. కార్మికుల వేతనాలు యిప్పటికి 1939నాటి స్థాయికే వచ్చాయి. స్వరాజ్యమొచ్చిన 1947నాడు తమకున్న పెట్టుబడులకు ఒకటి రెండు రెట్లకు తక్కువ లేకుండా బ్రిటిష్ కంపెనీలన్నీ 1953 నాటికి లాభాలు సంపాదించాయి. ప్రణాళికకాలాన్నే ఉదాహరణగా తీసుకుంటే, 1950లో 318 కోట్ల లాభాన్ని గడించిన పరిశ్రమల యజమానులు 1954 వచ్చేసరికి 511 కోట్ల రూపాయల లాభాల్ని పొందారు. ఇదేకాలంలో ఆ పరిశ్రమలలోని కార్మికుల, గుమాస్తాల జీతాలు రు. 232 కోట్ల నుంచి రు. 249 కోట్లకు పెరిగాయి. కొద్దిమంది కోటీశ్వరులకు పెరిగిన లాభాలు రు. 200 కోట్లుకాగా, లక్షలాది శ్రమజీవులకు పెరిగిన జీతాలు రు. 17 కోట్లు మాత్రమే. ఆ కొద్దిమందికి వచ్చే మొత్తం లాభాలలో, యీ అసంఖ్యాక ప్రజానీకానికి వచ్చే ఆదాయం సగానికి తక్కువే వున్నది. పెరిగిన ఆదాయంలో ఎవరివంతు ఎంత అని లెక్కగడితే, యజమానుల భాగం ప్రతి నూరింటా 57 రూపాయలుగావుండేది రు. 67కు పెరిగింది. కార్మికులభాగం రు. 43 నుండి రు. 33కు తరిగింది. బ్రిటిష్ తేయాకుతోట కంపెనీల లాభాలు ఒక్క సంవత్సరంలో రెట్టింపు అయ్యాయి. 1953లో ఆ లాభం రు.229 లక్షలు కాగా, 1954 మొదటి పదకొండు నెలల్లోనే ఆ లాభం రు. 434 లక్షలయింది. బర్మాషెల్ కంపెనీకి రిజర్వుఫండు, అరుగుదలఫండు, వడ్డీపోను నూటికి 8 రూపాయలు లాభం వచ్చింది. 1955-56 సాంవత్సరిక నివేదికలో రిజర్వుబ్యాంక్ యీ విషయాన్నే యిలా ధృవపరుస్తున్నది :

"లాభాలు పెరుగుతున్న ధోరణి, మొదటి ప్రణాళిక చివరి సంవత్సరాల్లోనూ, రెండవ ప్రణాళిక మొదటి సంవత్సరంలోనూ పెద్దఎత్తున కరెన్సీని అచ్చువేయడమూ మార్కెటు ప్రోత్సాహానికి ప్రధాన కారణాలు అయినాయి. ప్రభుత్వం సోషలిస్టు తరహా

సమాజాన్ని నిర్మించడానికి నిర్ణయించినా, ప్రయివేటు వ్యాపారానికి గణనీయమైన అవకాశం గలదని పెట్టుబడిదారులు సంతృప్తి చెందుతున్నారు".

1950 నాటి ధరలతో 1956 ధరలను పోల్చిచూస్తే, యీ మధ్యకాలంలో జరిగిన పెరుగుతరుగులన్నీ పంటలు పండించే రైతాంగానికి నష్టదాయకంగానూ, పెట్టుబడిదారులకు లాభదాయకంగానూ వున్నాయి. 1950 లో కొరియా యుద్ధం వలన ధరలు చాలా హెచ్చుస్థాయిలో వున్నాయి. 1956 మే నాటికి కొద్ది తేడాలతో ఆ స్థాయికి పెరిగాయి. మొత్తం అన్ని వస్తువుల ధరల్ని లెక్కలోకి తీసుకుంటే, ఒకటిన్నర శాతం అప్పటి కంటె తక్కువ. పారిశ్రామిక వస్తువులు, తదితరాలు అప్పటికంటె 9 శాతం, 15 శాతం ఎక్కువగానే వున్నాయి. వ్యాపారపంటలు ఆనాటికంటే 2 శాతం తక్కువ. ఆహారపదార్థాలు దాదాపు 15 శాతం తక్కువ. పంటలధరలు 1955 మొదటిరోజుల్లో మరీ తగ్గిపోయాయి. కాని పారిశ్రామిక వస్తువులధరలు ఆనాడూ పైమెట్టునే వున్నాయి.

మొదటి ప్రణాళిక కాలంలో ప్రవేశపెట్టిన వ్యవసాయ సంస్కరణలు పరిమితమైనవి. అందులో ఎక్కువభాగం అమలులోకి రానేలేదు. వాటివలన కొన్ని మార్పులు వ్యవసాయ రంగంలో కలిగాయి. కాని సామాన్యరైతాంగానికీ, వ్యవసాయ కూలీలకూ తోడ్పడినదానికంటె ధనికరైతులు భూములు కొనుక్కోడానికీ, భూస్వాములు పాతపద్ధతిని మాని స్వంత కమతాలు ఏర్పరచుకొని సాగుచేయించటానికీ తోడ్పడ్డాయి.

మొదటి ప్రణాళిక కాలంలో సోషలిస్టుసమాజ నిర్మాణపు వాసనైనా తగలలేదు. పోనీయండి, రెండవ ప్రణాళిక కాలాన్ని చూద్దామా అంటే ప్రభుత్వం అనుసరించే పద్ధతులు అందుకు భిన్నంగా లేవు. ప్రణాళిక ఖర్చుభారాన్ని ఎవరినెత్తిన పెట్టచూస్తున్నదో, పన్నుల విషయం చర్చించిన సందర్భంలో పరిశీలించాం.

ఆదాయాల్లో వ్యత్యాసాలు తగ్గించుతానసే ఆశయాన్ని ప్రభుత్వం ప్రచారం చేస్తున్నదేగాని, ఆచరణలో ఆదాయాలు తక్కువగా వున్నవారిపైనే మరింత భారాన్ని నెట్టునట్లు ప్రవర్తిస్తోంది. వ్యత్యాసాలు తగ్గించడానికి రెండు పద్ధతు లున్నాయని ముసాయిదా ప్రణాళిక చెప్పింది. ఒకటి, పైవారి ఆదాయాలు తగ్గించడం. రెండు, తక్కువ ఆదాయాలవారి ఆదాయం పెంచడం. కాని అదనపు కరెన్సీ చలామణి, పరోక్షపు పన్నులు పెంచడం పైరెండు మార్గాలకూ వ్యతిరేకమైనవే. జీతాల వ్యత్యాసాలు తగ్గించే విషయంలోనూ ఏ ఒకటి రెండు సందర్భాలలోనో తప్ప ప్రభుత్వ వైఖరి అభివృద్ధి నిరోధకంగానే వున్నది. అయిదు సంవత్సరాల కాలంలో నవచైనా అధ్యక్షుని జీతానికీ, ప్రభుత్వంయొక్క ఆఖరి నౌకరు జీతానికీ మధ్యగల వ్యత్యాసాన్ని అయిదురెట్లకు తెచ్చింది (రు. 560-120). పదిసంవత్సరాల స్వరాజ్యం అనుభవించిన తర్వాత నేటికీ మన అధ్యక్షుడు, గవర్నర్లు, ఉన్నతోద్యోగుల జీతాలకూ, సామాన్య ప్రభుత్వ నౌకరు జీతానికీ మధ్యవున్న వ్యత్యాసం వందలపాళ్ళలోనే వుంటూన్నది.

పోగా ప్రణాళికలో ప్రకటించిన ఆశయాలకు ఖచ్చితంగా కట్టుబడియుండక, అనేక సందర్భాల్లో ప్రభుత్వం అభివృద్ధినిరోధక మార్పులకు తలొగ్గుతూన్నది. ప్రణాళికచట్రం ప్రకటించిన సూచనలనుండీ, 1956 ఫిబ్రవరిలో ప్రకటించిన "ముసాయిదా రూపం" సూచనలనుండీ కూడా యిప్పటి ముసాయిదా ప్రణాళిక సూచనలు కొన్ని వెనక్కు నడిచాయి.

పారిశ్రామిక విధానంలో మొదట అనుకున్నదానికంటె ప్రయివేట్ వ్యాపారులకు, పారిశ్రామిక వేత్తలకు అనుకూలమైన మార్పులు చేసింది. ప్రభుత్వ రంగంలో పరిశ్రమలకు మొదట రు. 1100 కోట్లు ఖర్చుపెట్టదలచగా ఇప్పుడు రు 891 కోట్లు మాత్రమే అంచనా వేస్తున్నది. ప్రయివేట్ పారిశ్రామికవేత్తలకు మొదట కేటాయించినది రు. 400కోట్లుకాగా ఇప్పుడు రు. 575 కోట్లు కేటాయించి,

రు 100కోట్లు తానే అప్పుగా యిస్తానన్నది. బట్టల మిల్లులకు ఆధునిక యంత్రాలను తెచ్చుకునే అవకాశం మొదట యివ్వవద్దనుకొని, తర్వాత యిచ్చింది. దీనితో రెండు చిక్కులు వచ్చిపడ్డాయి. తక్కువమంది కార్మికులతో ఎక్కువ శ్రమచేయించే యంత్రాలను తెచ్చి రేషనలైజేషన్ద్వారా కొందరి కార్మికుల్ని నిరుద్యోగానికి నెట్టుతారనే భయం కార్మికుల్లో కలిగింది. ఇంకా 35 కోట్లగజాల బట్టను ఉత్పత్తిచేయడానికి మిల్లులకే అవకాశం కలిగిస్తే, అందుకు తోడు మరమగ్గాలనుకూడా ప్రవేశపెడితే చేనేత పారిశ్రామికులు తయారుచేసే బట్ట ఖర్చుగాక నిరుద్యోగం ఎదుర్కొంటుందనే భయం చేనేతవారిలో వచ్చింది. ప్రభుత్వం కోటాలు నిర్ణయించి ఫరవాలేదని చెబుతున్నా, 1954 కంటె '55 లోనూ, '55 కంటె '56 లోనూ బట్ట ఎగుమతి తగ్గటంతో యీ భయం మరింత ఎక్కువయింది.

ప్రణాళికాచట్రం 120 లక్షల మందికి పనులు చూపాలని సూచిస్తే, యిప్పటి ముసాయిదా ఆ లక్ష్యాన్ని 80 లక్షలకు తగ్గించింది.

ఫిబ్రవరి ముసాయిదా రు. 1600 ఫలసాయంగాని, రు. 1200 నికరాదాయంగాని గల భూమిని కుటుంబ కమతంగా నిర్ణయించి మూడు కుటుంబ కమతాలమేరకు గరిష్ట పరిమితి పెట్టాలని స్పష్టంగా సూచించింది. ఇప్పటి ముసాయిదా వ్యవసాయ సంస్కరణలకు అత్యంతావసరమైన ఆ నిర్దిష్ట సూచనను ఉరుం గల్లంతుచేసింది. కుటుంబకమతం ఎంత వుండాలో, గరిష్టపరిమితిని కుటుంబానికి యింతని పెట్టాలో లేక వ్యక్తికి యింతనిపెట్టాలో రాష్ట్ర ప్రభుత్వాలనే నిర్ణయించుకోమని వదిలివేసింది. అసలు పరిమితికే వ్యతిరేకంగా వున్న ఆంధ్రప్రభుత్వం ఆ హద్దును ఎక్కడ గీస్తుందో ! గరిష్ట పరిమితి కొన్ని భూములకు వర్తించదని గతంలో చెప్పింది. ఆ మినహాయింపులకు యిప్పుడు మరొక మినహాయింపును తోడుచేసింది. పంచదార మిల్లుల ఆధ్వర్యానవుండే చెరకుతోటలకు

గరిష్టపరిమితి వర్తించదట. వేలకొలది యకరాలుగల చల్లపల్లి రాజాలాంటి వారు పంచదార మిల్లుల్ని పెడుతున్నారు; చెరకూ వేస్తున్నారు. ఇక ఏ హద్దూ ఆయనకు వర్తించదు! ఇటువంటి నైఖరితో ఆదాయాల వ్యత్యాసాలను తగ్గించడంగాని, ప్రజలను ఉత్సాహపరచడంగాని ఎలా సాధ్యపడుతుంది?

దేశంలో వెనకబడియున్న ప్రాంతాలను అభివృద్ధి చేసేందుకు ప్రత్యేకదృష్టి వుండాలని ప్రణాళికాసంఘం చెప్పింది. కాని ఆంధ్ర అనుభవంచూస్తే అందుకు ఏమీ శ్రద్ధపుచ్చుకొన్నట్లు కనపడదు. పరిశ్రమల్లో ఆంధ్ర చాలా వెనకబడియున్నది. అయినా ఆంధ్రకు కేటాయించిన రు. 120 కోట్లలో రు. 10 కోట్లే పరిశ్రమలకు కేటాయించబడ్డది. ఇదివరకే ఏర్పడిన విశాఖపట్టణం ఓడల నిర్మాణ కంపెనీని మినహాయిస్తే మరే పెద్దపరిశ్రమ నిర్మాణాన్నీ ఆంధ్రకు గాని, ఏర్పడనున్న ఆంధ్రప్రదేశ్‌కుగాని కేటాయించలేదు.

భారత ప్రభుత్వం ఇంపీరియల్ బ్యాంకినీ, జీవితభీమా వ్యాపారాన్నీ జాతీయంచేయడం హర్షించదగిన విషయం. నిజానికి యీ నైఖరి బలపడి కీలక పరిశ్రమల్లో చాలా భాగాన్ని జాతీయం చేస్తే దేశానికెంతో ఉపయోగం. కాని, కొన్ని సంస్థలను జాతీయం చేసినంతమాత్రాన అది సోషలిస్టు సమాజ నిర్మాణ మనిపించుకోదు. జాతీయమైన సంస్థలకు సహితం గుత్తపెట్టుబడి వారులే డైరెక్టర్లుగావుండి పాలిస్తున్నారు. ఇది పెట్టుబడిదారుల పెత్తనానికి చిహ్నమేగాని, సోషలిస్టు సమాజ నిర్మాణానికి కాదు. పైగా మన పునర్నిర్మాణం జయప్రదంగా సాగాలంటే అత్యావస రంగా జాతీయం చేయవలసినవి ఎన్నో వున్నాయి. నాయకత్వం కష్టజీవులకు ప్రాతినిధ్యం వహించేవారిదైతే, జాతీయం అయిన పరిశ్రమలు పెట్టుబడిదారీ పద్ధతుల్ని విడనాడి సోషలిస్టు పునర్నిర్మాణానికి పునాదులౌతాయి. ముసాయిదా ప్రణాళిక ప్రభుత్వ పరిశ్రమల్లోని కార్మికులకు, ప్రయివేట్ పరిశ్రమల్లోని కార్మికులకు

విచక్షణ చూపవద్దని కోరుతోంది. కాని వేతనాల కమిషన్ సిఫార్సులవంటివాటిని ప్రభుత్వమే అమలుజరుప తిరస్కరిస్తోంది. కేంద్ర కార్మిక మంత్రి శ్రీ వి. వి. గిరి రాజీనామా యిస్తూ, యీ విషయంలోకూడా తన అసమ్మతిని తెలిపిన విషయం జగద్విదితమే.

మన ప్రభుత్వంకూడా సోషలిస్టు సమాజ నిర్మాణానికి పూనుకున్నానంటున్నది గనుక, అదే కర్తవ్యానికి పూనుకున్న చైనానూ, భారతదేశాన్నీ పోల్చడం యిక్కడ అప్రస్తుతం కాదు. నూతన భారతావని ఏర్పడి 9 సంవత్సరా లయింది. నవచైనా ఏర్పడి 7 సంవత్సరాలు కావస్తున్నది. వాళ్ళ మొదటి పంచవర్ష ప్రణాళిక 1957 లో పూర్తవుతుంది. మన మొదటి ప్రణాళిక 1956 లో పూర్తయింది. ఇక్కడ సోషలిస్టు సమాజానికి యీ ప్రణాళిక పునాదులు వేసిందన్నట్లే, తమ ప్రణాళిక పునాదులు వేసిందని చైనావారూ చెబుతున్నారు. చైనాలో వ్యవసాయ సంస్కరణలు పూర్తయ్యాయి. భూస్వాములనేవారు లేరు. రైతాంగంలో నూటికి 90 మంది సహకార పద్ధతికి అంగీకరించి సమిష్టిగా వ్యవసాయం కొనసాగిస్తున్నారు. నూటికి 50 మంది, అంతకంటె వున్నతమైన సమిష్టిక్షేత్రాలలోనే సభ్యులుగా వున్నారు. మనదేశంలో నష్టపరిహారం ఇచ్చి గరిష్టపరిమితిపెట్టే విషయంకూడా తెంపులేని చర్చలోనే వుండిపోయింది. చైనాలో యీయేడు మార్చినాటికో చేనేత పారిశ్రామికుల్లో నూటికి 88 మంది సహకార సంఘాలద్వారా తమ వ్యాపారం చక్కపెట్టుకుంటున్నారు. మన దేశంలో యీ సంఖ్య బహుతక్కువ. చైనాలో ప్రయివేట్ పరిశ్రమల్లో నూరింట 92 వంతులు యిప్పుడు ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్త పరిశ్రమలై పోయినాయి. ప్రయివేట్ పెట్టుబడిదారుల భాగాలకు వడ్డీమాత్రం యిస్తున్నారు. అలాగే ప్రయివేట్ వ్యాపారంలో 75 శాతం సంయుక్త వ్యాపారంగా మారిపోయింది. ఆ విధంగా ఉత్పత్తిసాధనాలను సమిష్టి ఉపయోగానికి తెచ్చుకుంటున్నారు.

కాని భారతదేశంలో అటువంటి పరిస్థితికి దగ్గరలోవున్నా మనికూడా చెప్పుకోలేము. చైనాలో యీఏడు కార్మికులందరి వేతనాలనూ సగటున 15 శాతం పెంచారు. సోషలిస్టు విప్లవ ప్రవాహంలో కార్మికుల ఉత్సాహం ఏనాడూ లేనంత ఉచ్ఛస్థాయి నందుకొన్నదని చైనా ప్రధాని ప్రకటించాడు. మూడుసంవత్సరాల దాపులో సోషలిస్టు విప్లవంలో ప్రధానభాగం దేశమంతటా పూర్తవుతుందని చైనా అధ్యక్షుడు మావ్ సెటుంగ్ ప్రకటించాడు. కాని భారతదేశంలో ధరలు పెరిగినకొలదీ కార్మికులు వేతనాల కొరకు పోరాడవలసి వస్తున్నది. 1954 లో వచ్చిన పారిశ్రామిక తగాదాలకు రెట్టింపు తగాదాలు 1955 లో వచ్చినట్లు రిజర్వు బ్యాంకి రిపోర్టు విదితం చేస్తోంది. ప్రభుత్వంనడిపే రైల్వేలలో సహితం కార్మికులు సమ్మెలుచేయక తప్పని పరిస్థితిని చూస్తున్నాం. కార్మిక విధానంలో ఉత్పత్తిని పెంచే విషయం, శిక్షణలో పని చేయవలసిన విషయం ప్రణాళిక ముసాయిదా నొక్కి చెప్పిందే గాని, కార్మికుల వేతనాలను ఇదమిద్ధంగా పెంచే విషయం కన పడదు. సూచనప్రాయంగా పై విషయాలు చూస్తే సోషలిస్టు సమాజ నిర్మాణానికి పూనుకున్నామని చెప్పడం సాధ్యంకాదు.

ఏమైనప్పటికీ, మన ముందున్న సమస్య ప్రభుత్వం ఎంత సోషలిజం తెస్తుంది అనేదికాదు. సోషలిస్టు విధానం ప్రపంచ విధానంగా రూపొందటంతో, మన దేశ ప్రజానీకంలో కూడా సోషలిస్టుభావం ఎంత బలపడ్డదో అర్థం అవుతుంది. ప్రభుత్వం కూడా సోషలిస్టు సమాజ నిర్మాణమే తన ధ్యేయమని ఎందుకు ప్రకటించవలసి వచ్చిందో విదితమవుతుంది. సోషలిస్టు విప్లవానికి ముందు నెరవేర్చుకోవలసిన కర్తవ్యాలు – భూస్వామ్య విధానం రద్దు, బ్రిటిష్ పెట్టుబడులను జాతీయం చేయడం – ఎంత త్వరగా నెరవేర్చుకొని స్వతంత్ర ఆర్థిక పునాదిని ఏర్పరచుకొని సోషలిజం వైపు పురోగమించాలో బోధపడుతుంది.

## ఆశయాల అమలుకు పోరాడాలి

రెండవ ప్రణాళికలోని లోపాలనూ, పరిమితులనూ గమనించాం. ప్రభుత్వం ప్రకటిస్తున్న ఆశయాలకూ, ఆచరణకూ మధ్య చాలాదూరం వున్న విషయాన్ని చూశాం. మనదేశాన్ని త్వరగా అభివృద్ధిచేసుకోవలసిన అవసరం వున్నదనీ, అందుకు అవకాశాలుకూడా వున్నాయనీ గుర్తించాం. పరిస్థితులకు అనుగుణ్యమైన, సంతృప్తికరమైన ప్రణాళిక మనముందు లేకపోయినప్పటికీ ఉన్న ప్రణాళికలో ఉత్తమమైన సూచనలను ఆధారంచేసుకొని, అవసరమైన మార్పులకొరకు పోరాడుతూ ముందుకుపోవడంకంటె మార్గంలేదు. ఈ కార్యక్రమాన్ని ఎంత జయప్రదంగా నెరవేర్చితే అంత మంచి ఫలితాలను పొందగలుగుతాం.

ముసాయిదా ప్రణాళిక కొన్ని మంచి ఆశయాలను ప్రకటించింది. జాతీయాదాయాన్ని పెంచడం, ప్రభుత్వ యాజమాన్యాన భారీపరిశ్రమలను అభివృద్ధిచేసే కార్యక్రమంపై కేంద్రీకరించి పారిశ్రామికాభివృద్ధిని సాధించడం, ఉద్యోగ అవకాశాలను పెంచడం, ఆదాయాల్లోనూ ఆస్తుల్లోనూ వ్యత్యాసాలు తగ్గే విధంగా న్యాయమైన ఆర్థికవిభాగం జరిగేటట్లు చూడటం—అనేవి ఆ ఆశయాలు. దేశంలో పారిశ్రామికాభివృద్ధిని సాధించేందుకు సోషలిస్టు రాజ్యాల సహాయాన్నికూడా పొందటానికి ప్రభుత్వం ఆమోదించింది. దేశంలో కౌలుదారులకు రక్షణ కల్పించాలనీ, గరిష్టపరిమితికి పైబడిన భూమిని—నష్టపరిహారంతోనే అయినా — పేదలకు పంచాలనీ సూచించింది. ఈ ఆశయాలు నిజంగా నెరవేరినట్లయితే, నేటికన్న మన ఆర్థిక విధానం బాగుపడుతుందనేది నిర్వివాదాంశం. బ్రిటిషు గుత్తకోటీశ్వరుల దోపిడీని తొలగించుకొనకపోయినా, నేటికన్న ఎక్కువ ఆర్థిక స్వాతంత్రశక్తిని మనదేశం సంపాదించుతుందనటం లోనూ సందేహం లేదు. భూస్వామ్యవిధానం పూర్తిగా రద్దుకాకపోయినా బలహీనపడక

తప్పదు. కనుక ప్రణాళికలో ప్రకటితమైన యీ ఆశయాలను ప్రజానీకం బలపరుస్తూ, వాటిని అమలులోకి తెచ్చేందుకు ఎంతగా పోరాడితే అంతగా పై ఫలితాలు చేకూరుతాయి.

పై ఆశయాలను ప్రకటించిన ప్రభుత్వమే ఆ ఆశయాలకు విరుద్ధంగా తన విధానాల్లో ఎక్కువ భాగాన్ని రూపొందించుకుంటోంది. అనుసరించే పద్ధతులు ఆశయాలను భగ్నపరచేవిగానే వున్నాయి. ఆ విధానాలనూ, పద్ధతులనూ ప్రతిఘటించి పోరాడకుండా పై ఆశయాలు అమలులోకి వస్తాయనుకోవడం భ్రమ అని గత ప్రణాళిక అనుభవం చెబుతోంది.

అయితే ప్రణాళికా సంఘం, ప్రభుత్వం ప్రకటించిన ఆశయాలు ఎన్ని భేదాభిప్రాయాలున్నా ప్రజలంతా ఐక్యమవడానికీ, పట్టుబట్టి ఆశయాలకు కట్టుబడివుండమని ప్రభుత్వాన్ని నిగ్గదీయడానికీ అవకాశాలు కలిగిస్తున్నాయి. ఈ పనిని జయప్రదంగా ప్రజలు నిర్వహిస్తే ఆశయాలు అమలులోకి వస్తాయి. లేకపోతే భారాన్ని ప్రజలపై నెట్టే అభివృద్ధి నిరోధక పద్ధతులు పరిపాలన సాగించి, పై ఆశయాలను వమ్ముచేస్తాయి.

రెండవ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమలు – ఖనిజసంపద, రవాణా అభివృద్ధి

— చంద్ర రాజేశ్వరరావు

రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ కూలీలు

— తురిమెళ్ళ గోవిందయ్య

రెండవ పంచవర్ష ప్రణాళికలో సమాజ వికాస కేంద్రాలు – సంక్షేమ పథకాలు

— పరకాల పట్టాభిరామారావు

రెండవ పంచవర్ష ప్రణాళికలో భూసంస్కరణలు

— చలసాని వాసుదేవరావు

రెండవ పంచవర్ష ప్రణాళికలో కార్మిక విధానం

— కె. యల్. నరసింహం



స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సు, విజయవాడ–2.

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA122B198 |
|---|---|
| పుస్తకం పేరు | రెండవ పంచవర్ష ప్రణాళిక పరిశీలన |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II, , 2, 59, 62 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| | Mounika |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |